# సాహసిక వీర చరిత్ర

(చారిత్రాత్మకము)

# SAHASIKA VEERA CHARITRA

(Historical)

డాక్టరు - దువ్వ శేషగిరిరావు

Approved by the Madras Text-Book Committee

*For School use*

Vide Fort St. George Gazette Part I. B.

PAGE DATED

## తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 17 | 14 | మంత్రము | వంత్రము |
| 21 | 2 | జన్మ | రాష్ట్ర |
| 26 | 18 | మాన్పుటకు | మాన్పుట |
| 39 | 20 | మననా | తమనా |
| 44 | 10 | నెటరా | వెంటరా |
| 45 | 1 | కూర్చుడు | కూర్చుండు |
| 53 | 1 | వార | వీర |
| 59 | 1 | రాణివాసము: | రాణివాసము |
| 63 | 16 | వార | వీర |

# సాహసికవీరచరిత్ర

(చారిత్రాత్మకము)


గ్రంథకర్త:

డాక్టరు: దువ్వూ శేషగిరిరావు



మొదటికూర్పు 1300 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1930




[వెల రు 1-0-0

# పీఠిక.

పాఠకమహాశయులారా !

నే వ్రాయుచున్న చారిత్రాత్మకకథలను ముగించి పుస్తకరూపమున ప్రచురించి మీ కందజేయుచున్నాను. నే వ్రాయుచున్న సంపూర్ణవచనాంధ్రమహాభారతమును కూడ త్వరలో ముగించి మీ కందఁజేసికొందును. నన్నాశీర్వదించి యీపుస్తకమును సరిచూచి యిచ్చిన సుప్రసిద్ధనవలా రచయితలగు శ్రీ వేంకట పార్వతీశ్వరకవులకు నాకృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

పిఠాపురం,<br>16-3-30.

ఇట్లు<br>గ్రంథకర్త.



# ఏనారీశిరోరత్నము

నేడు జరుగుచున్న తనమనుమరాలి వివాహమహో
త్సవమే తన చరమవాంఛలలోనికెల్ల ముఖ్యతమమైనదిగా
చించి కీర్తికాంతయయ్యెనో

ఆసంఘసంస్కరణప్రియురాలు, పుట్టుభోగి, వివేకవతి
యాశీల, పరోపకారపారీణ, భాషాభిమాని, వేదాంతవిచా
, దీనులపాలిటి బంధువు, మహాలక్ష్మీసంవత్సరాలు, శివ
స్త్రాలు, దానధర్మాముల స్వకుటుంబమునకేగాక స్వసంఘ
నకే మొనలేని కీర్తిసంపాదించిన రాజగోపాలంవారామ్మగారి
మరిత, నాపినతల్లి

## వరహాలమ్మగారి

శ్రీహృదయమునకు నేడు నామేనకోడలు చి॥సౌ॥ మాణి
ంబను చి॥ కృష్ణారావునకిచ్చి చేయుచున్న పరిణయమ
కత్సవసుముహూర్తమున అంకితముగా సమర్పించుకొను
న్నాను.

కినాడ,
3-1930.

గ్రంథక



# పర్టబ్ సింగు.



నాల్గువందల సంవత్సరములకుపూర్వ మొకనాఁటి ప్రాతఃకాలమున ఆరావళీపర్వతపరిసరారణ్యప్రదేశములలో యౌవనుఁడును కొంచెము పొడవరియు పరాక్రమశాలియు నగు నొక రాజపుత్రయోధుఁ డొక యుత్తమాశ్వము నధిరోహించి పోవుచుండెను. అతని యంగసౌష్ఠవమును, కురుచలౌ పాదములును, హస్తములును పలని రక్తనాళములగుండ ప్రవహించు రసపుత్రవీరరక్తముయొక్క ఘనతను వెల్లడించుచుండెను. పర్టబ్ సింగుపాలనయందున్న రాజ్యమంత పెద్దది కాకపోయినను, సింహళమును జయించి ఘనతకెక్కిన శ్రీ రామచంద్రుని వంశావళి ఘనతకేమాత్రము కళంక మాపాదింపఁబడకుండునంతటి శక్తిసామర్థ్యములతో నాతఁడు రాజ్యపాలన మొనరించుచుండెను. ఆనాడటు లాతఁడు వేటకాని దుస్తుల ధరించి తనకు తారసిల్లిన యేయడవిమృగమునైనను చంపుట కొక యీటెను హస్తమునందు ధరించిపోవుచుండెను.

చాలదూరము పోవువఱకు నాతని కెట్టిజంతువులును కానరాలేదు కాని తుదకొకచోట పెద్దదగు నొక యడవిపంది నాతఁడు గాంచెను. మార్గము సరిగాలేనందున మెట్టటో

కష్టపడి దాని సమీపించి బల్లెమున దానిపక్కలో పొడు
చుటకు ప్రయత్నించుచుండెను. దురదృష్టవశమున నానము
యమందే యతఁ డధిరోహించిన యశ్వము కాలుమెలకపడి
తనపైనున్నయాతని క్రిందఁ బడద్రోసి తాను నేలపైఁ బడి
పోయెను. హఠాత్తుగ సంభవించిన యీ యుపద్రవములో
బాణము నగముఁ బఱకు పందిపక్కలో గ్రుచ్చుకొనిపో
యెను.

తత్క్షణమే కర్టబ్‌సింగు సర్దుకొని లేచి నిలువఁబడి
కండితో డీకొనుటకు సంసిద్ధుఁడాయెను. ఆయడవిమృగ మీ
ఈపోటుచే బాధనొందుటకు బదులు కోపోద్దీపితమై పండ్లు
పటపటకొరుకుచు వాతనిపై తిరుగఁ బడెను. ఆయడవియం
దలిజంతువు లన్నిటికంటెను పెద్దదగు నాపందికొమ్ముల
యొక్క వాఁడికి నాయోధునిచే విసరబడిన కత్తిపోటేమి
యు పనిచేయలేదు. దెబ్బతిని రోషాయితమైన యాపందితో
నాతఁ డెట్లుపోరాడఁగలఁడో యాశ్చర్యముగొలుపక మాన
దు. మృత్యుముఖులై యాతఁడును నాపందియును పెనగు
లాడుచుండఁగా, హఠాత్తుగను, ఆశ్చర్యముగను నాపంది
భూమిపైఁ బడి దొరలుచు మృతినందెను.

ఈవిధముగా నట్టిభయంకరాపత్తునుండి విముక్తుఁడైన
పిదప కర్టబ్‌సిం గామృతినందినమృగమును పరీక్షించుట
కై పోయి, వెంట్రుకలపఱకను జంతుశరీరమున గ్రుచ్చు

కొనిపోయిన 'అమ్మ' దానిహత్యాస్మరణమునకు కారణమని గ్రహించెను. సమయానుకూలముగ తనకు సహాయము చేయ వచ్చినవారెవ్వరాయని నలుగడల పరికింపఁగా, లతలవలె నల్లుకొనిపోయిన వృక్షసముదాయముల సందునుండి తన్ను మోహమూర్ఛితునిగా నొనరించునంతటి మనోహరమూర్తి యాతనికి దృగ్గోచరమయ్యెను. పదునైదు లేక పదునాఱు వత్సరముల యౌవనాంగి, విల్లు చేత ధరించి, తాను మోయు చున్న సుకుమారమైనబరువును గాంచి గర్వమునొందు చున్నదోయనునట్లు దర్పమునీయుచున్న యరబ్బీగుఱ్ఱము నధి రోహించియున్న యొక సుందరాంగి వాతఁడు గాంచెను.

పర్బట్ సింగు గ్రహసంకష్టుఁడైయుండిన తన కన్నె దుటనుండిన ప్రతిమఁగాంచి 'ఒలింపస్ కొండనుండి' "డయనా" దేవతదిగి వచ్చి తనముందు సాక్షాత్కరించెనాయను సందే హమును పొందియుండెడివాఁడే? పరిశుభ్రమగు గాలిచే నా వరింపఁబడిన విశాలప్రదేశము లందు ఆరోగ్యజీవితమును గడ పుచుండుటఁ బట్టి కలిగిన యాపెశరీరచ్ఛాయయొక్క శోభ యామెయౌవనమున కెంతయు వన్నెఁదెచ్చుచుండెను. తర చు సూర్యరశ్మికి పాత్రములగునామె పెదవులు కొంచె మెఱ్ఱ బారియుండినను పర్బట్ సింగు కన్నుల నదికూడ నాకర్షించు చుండెను. ఏలయనగా జనానాయందుండి పాలిపోయినముఖ కాంతిగల స్త్రీలయందలి యందముకంటె నామెయందలి

సౌందర్యాతిశయమే దానికిఁ గారణము. మృదుతరమైన యంగసౌష్ఠవముగల యామె నిలుచుతీరును ప్రతి చలనము కూడ సౌమ్యతతోఁ గూడినవై మనకథానాయకుని మోహవారాశిలో ముంచివైచుచుండెను. కాని పర్టబ్ సింగాశ్చర్యవిముక్తుఁడగునప్పటికి నాబాలామణి తన యశ్వమును మరలించి మెఱుపుదీఁగవలె నదృశ్యయాయెను. అచ్చోట సంఘటించిన దంతయుఁ గాంచి యాతఁడది కలయా? నిక్కవమా? యని యూహింపఁదొడంగెను.

ఉదయమునుండియు మిక్కిలి యలసియుండుటచేత పర్టబ్ సింగు తనయశ్వము నధిరోహించి జనసంచారము గల ప్రదేశమునకుఁ బోనుద్దేశముతో నలఁగిన యొకబాటగుండ బయలుదేఱెను. అటుకొంత దవ్వేఁగఁగా, నూతనముగా నిర్మించఁబడిన కొన్నిగుడారములు గల మైదానమునకు వచ్చెను. చిన్నవియగు పెక్కుగుడారములును నడుమ పెద్దదగునొక గుడారము నాతఁడచ్చోటఁ గాంచెను. పెద్దదగు నాగుడారము నాతఁడు సమీపించి విచారణచేయఁగా నాప్రదేశము 'అఫ్‌గన్‌డాడ్'చే నోడింపఁబడి రాజ్యభ్రష్టుఁడైన అజితసింగను రాజపుత్రుని ప్రస్తుతనివాసమని తెలియవచ్చెను.

పర్టబ్ సింగు రాజ్యభ్రష్టుఁడగు నారాజయొక్క హృదయపూర్వకాహ్వానమును బడసి తన యలసటనంతయుఁ బాపికొనిన పిదప గృహయజమానునితో తనకును, వందికిని జరి

గిన పోరాటమును, అచ్చోట ఘటిల్లిన కథనంతయు వినిపిం పఁగా వారల కీక్రింది సంభాషణఘటిల్లెను.

అజిత—మీరు వర్ణించుకాంత సాహసికయగు నా కొమరిత పద్మినియే యైయుండవలయును. అఫ్ఘనులచే మా దుర్గమునుండి తరుమఁబడినప్పటినుండియు, నడవిజాతిస్త్రీవలె నీయడవినంతయు సంచరించుచు, శస్త్రవిద్యాకౌశల్యమందు ప్రవీణురాలైయున్నది. ఆనందదాయకమగు నీయరణ్యజీవిత మందలిసుఖమును గ్రహించిన దగుటఁజేసి బాదిషావంటి జనానాజీవితము నామె యసహ్యించుచున్నది. స్వాతంత్ర్య దీక్షగల యామె గూర్చి నాకేమియుఁ దోచుటలేదు."

పర్బట్—ఉదారస్వభావయగు నాసుందరాంగి నా మొదల నను గ్రహించుచో నాజీవితాంత మామెదాసుఁడనై మెలంగుదును ఆమె హృదయమందలి కోర్కెలన్నియు సమ కూర్చుటె నాకు ముఖ్యవిధియు, సంతోషదాయకము నైయుం దును."

అజిత—మీ రటులే కన్పట్టుచున్నారు కాని మాప ద్మినికి విపరీతముగు తలం పొకటియున్నది అఫ్ఘన్‌డాడ్‌షు జయిం చిపూర్వార్జితమగు మాపట్టణమును, దుర్గమును తిరుగఁజేకొన గల్గునట్టి వానిని తప్ప నితరుని పెండ్లియాడననియు, పట్టివాఁ డు నీగ్రోజాతివానికంటె నల్లనివాఁడైనను, రాక్షసుని కంటె వికారుఁడైనను పెండ్లియాడుదునని ప్రతినపట్టెను."

హర్బర్ట్ — హృదయపూర్వకముగ నే నందుల కియ్యకొంటిని. నామనోనిశ్చయము వినుఁడు. మీరాజఘుర్ దుర్గమును తిరిగి జయించుటయో లేక తత్ప్రయత్నమునఁ జచ్చుటయో నేను చేసితీరెదను. ఇందులకు దైవమేసాక్షి !"

సంభాషణానంతరము వారు తమతమనెలవులకుఁ జనిరి.

ఆనాఁటి మధ్యాహ్నమే తలవని తలంపుగా నజితసింగున కొకయుత్తరము వచ్చెను. అదియును పద్మినివివాహమునకు సంబంధించినదియే. ఇర్వురమహమ్మదీయయువతుల నుద్వాహమాడి జరాభారముచే కృంగియున్న అఫ్ఘన్ డాడ్, అపురూపమైన పద్మినిరూపురేఖావిలాసములఁ గూర్చి విని యామెఁ బెండ్లియాడ నిశ్చయించుకొని, తన యుద్దేశముఁ దెలుపుచు నొకయుత్తరము వ్రాసి యజితసింగునకుఁ బంపెను. కామోన్మత్తుఁడగు వాఁ డాయుత్తరమందు పద్మినిరూపురేఖావిలాసముల వర్ణించుచు తన్నుద్వాహమాడినచో నామె తనహృదయసీమకు రాణి యగుననియు, పెండ్లియాడుట కొప్పనిచో, నడవిఁ బ్రవేశించి బలవంతముననైనను పద్మినిఁ గొంపోదుననియు వ్రాసెను.

అజితసింగు జాబుఁ గాంచినంత దానిఁ గొనితెచ్చిన రాయబారి శిరస్సు తెగనఱుకునేమో యనునంత రోషకషాయితనేత్రుఁడై, డాడ్ చే పరాభవింపఁబడినప్పటినుండియు

వానిరూపు మూఁద ప్రతినఁబట్టియున్న పద్మినిగదిఁ బ్రవేశించి, యుత్తరము సంగతియు, పర్టబ్ సింగు ప్రతినసంగతియు నామె యాలకించెను. రాయబారిని క్షమించి విడచి పర్టబ్సింగుతో నాలోచింతమని యామె తనతండ్రిని శాంతిపరచెను.

మరునాఁడు రహస్యాలోచనసభ జరిపి డాడ్ యొక్క వాంఛితమునకు పద్మిని యనుమతించినదనియు, నెలరోజులలో పద్మిని సపరివారయై రానున్నదనియు, అందుకొఱకు అజితసింగు రాజ్యములో కొంతభాగము వారి కిత్తునని యాతఁడు ఖురానుసాక్షిగ నొప్పుకొనిన స్త్రైర్పాటుజరుగవలయునని యు వర్తమానమంపిరి. మోహాతురుఁడై యున్న యాతఁ డన్నిటికి నొడంబడెను.

మాసము దినములు గడచినపిమ్మట నొకనాఁడు పద్మిని పరివారసమేతయై రాజపుర్ కోటకు ప్రయాణమయ్యెను. అతిసుందరముగా తయారుచేయఁబడిన పద్మినిపాలకీ యాదశేము నడుమనుండెను. దానివెనుకనే యామెయుత్తమాశ్వము నధిరోహించి పర్టబ్సింగేగుచుండెను. పద్మినిపాలకీ కిరుప్రక్కలను మూఁడేసిపాలకీలును, నొక్కొక్కపాలకీయం దొక్కొక్కరసపుత్రయోధుఁడును మారువేషములతో నాయుధముల గుప్తపరచికొనియుండిరి. ప్రతిపాలకీని, బోయీలవేషములు ధరించిన యార్గురేసి రసపుత్రయోధులు మోయుచుండిరి. ఇట్లు మారువేషములతో నేఁబదియుంది రాజపు

త్రియోధుల సమూహము, మున్నూరుమంది సిపాయిల సహా యమున, ఇతరుల కనుమానమున కొంతమాత్రి మెడమీా యక, శుభకార్యమున కేగువారలవలె సంతోషముతో రాజ ఘర్ పురాభిముఖులై పోవుచుండిరి. పట్టణమునకు రెండుమై ళ్ళదూరమున, బంధుగులు స్నేహితులు నగు నిరువదిమంది తో, తన వికారమును కప్పిపుచ్చుటకై విలువగల పెండ్లివస్త్రు లధరించియున్న డాడ్ వారినెదుర్కొని స్వాగతమొసంగి వా రిని పట్టణప్రవేశముఁ జేయించెను. పట్టణము ప్రవేశించినం తనే పాలకీలఁ గ్రిందకు దింపునంతలో తనపాలకీనుండి విల్లు చేత ధరించి బయటకువచ్చి పద్మసింగు తనకొఱకు సిద్ధముగ నుంచిన తన యరబ్బీగుఱ్ఱము నెక్కునంతలో తక్కుంగలయోధు లందఱు తమ యాయుధములఁగైకొని యుద్ధసన్నద్ధులైరి. ఈ వైచిత్ర్యమునంతయుఁ గాంచి "డాడ్" ఆశ్చర్యనిమగ్నుఁడై, తత్క్షణము యుద్ధప్రవృత్తుఁడై రానాదించి తన ప్రక్కనున్న వార లను యుద్ధసన్నద్ధులఁ జేసెను. ఉత్సవముఁ గాంచవచ్చినవారిలో కొందఱు మహమ్మదీయులును, కొందఱాపట్టణపు పూర్వవా సులగు హిందువులు నున్నారు. ఎవరిమతములకొఱకు వారు పోరాటకు సంసిద్ధులైరి.

సమరము పద్మినిచే నారంభింపఁబడియెను. గుఱ్ఱము నెక్కి యామె డాడ్ హృదయమును గుఱిచూచి విల్లు నెక్కు పెట్టెను కాని స్త్రీలకు సహజమగు మృదులత యామెహృ

దయమునఁ బ్రవేశించి, యాపెను దనకృత్యముగుండి మర
ల్చెను. అంత నామె తన బాణముతో నాతనిగుఱ్ఱమును గొ
ట్టగా నది నేలపైఁ బడెను. డాడ్ భూమిపైఁబడి దొరలుచు
నర్ధకొని లేచునంతలో రాజపుత్రులు అశ్వములను వెనుదరు
ముచు పట్టణపుగోపలిభాగమును ప్రవేశించుచుండిరి. మంద
బుద్ధులై వా రటుపోవుటఁ గాంచి తా నొక్కఁడు నచ్చోటికిపో
యినను లాభము లేదని డాడ్ రయమున దుర్గద్వారములబా
ధింపనెంచి జనశూన్యమైయున్న యచ్చోటికిఁ జనెను. అతఁ
డు తన ప్రయత్నమునందే కృతార్థుఁడైయున్నచో లోపలను
న్న రాజపుత్రులు జయలక్ష్మిఁ గొనుటకు మాఱుగా నశిం
చి పద్మిని మహమ్మదీయులపాలగుటయు, తాము బోనులోని
మూషికములవలె నశియుటయుఁగూడ తటస్థించియుండె
డిది. కాని యాతఁ డచ్చోటికి వచ్చుట కించు మాలస్యమై
నది. అంతలో రాజపుత్రులసహాయార్థ మరుదెంచిన సేన
దుర్గద్వారములను బ్రవేశించుచుండుటఁ గాంచి, శరవేగము
నఁబోవునొకయశ్వము నధిరోహించి తన సహాయమునకు
కు నూతనముగా నేర్పడి పోరాడుచున్న సేనను డాడ్ కలసి
కొనెను.

అనూతనమహమ్మదీయసేన యత్యుత్సాహముతో
పర్టబ్ సింగుతో నున్న కొలఁదిమందిరాజపుత్రులపైఁ
బడెను. పర్టబ్ సింగా నాఁడు యుద్ధభూమియం దగుపరచిన
శౌర్యల మత్యద్భుతమును, అవర్ణనీయమునైనది. కాని గాయ

ములు చాలతగులుటచే వాఁడు నేలపైఁ బడెను. ఆతనిప్ర
క్కనే పెక్కురు రాజపుత్రులుకూడ గాయములుకలవారై
పడిపోయిరి. పద్మిని రౌద్రావతారమున నచ్చటిసేనను నుఱు
మాడుచుండెను. అట్టి భయంకరసమరసమయమున హిందు
వులగు నప్పట్టణవాసులతోఁ గూడిన యొకరసపుత్రసేన దుర్గ
ముఁ బ్రవేశించి యతిరయమున యుద్ధభూమిఁ బ్రవేశించి మహా
మ్మదీయసేనను రూపుమాప మొదలిడిరి. అదిగాంచి డాడ్
తుదిసారి పర్టబ్‌సింగుపైఁ బడెను. కాని తానే యాతనియధీ
నుఁ డయ్యెను. అటులా వాఁడు రాజపుత్రులు సంపూర్ణవిజ
యముఁ గాంచుటయు, డాడ్ పర్టబ్‌సింగువశ మగుటయు
జరిగెను.

ఈరీతిగా పర్టబ్‌సింగు పద్మినిని తనకొఱకును, మామ
గారికొఱకు రాజపుర్‌ను సంపాదించెను. డాడ్ మాత్రము
పద్మినియందు ముందుకంటె నెక్కుడు మోహితుఁడై యెప్ప
టికైన నామెను బలిమినైనఁ గొంపోవుదని శపథముచేసెను.
తరువాత చాలకాల మాతఁడు జీవించియుండెను. కాని తన
కోర్కె నెఱవేర్చుకొనశక్తుఁడు కాకపోయెను. యథారీతిని
పద్మినిఁ జేపట్టినతరువాత కొంతకాలమునకు శౌర్యపరాక్రమ
ధుర్యులగు పుత్రులను సౌందర్యశిరోరత్నములగు పుత్రికలను
బడసి యాప్రియదంపతులు కృతార్థులైరి. వారి సత్సంతాన
ము రసపుత్రులకీర్తికేమాత్రము కళంకము రాకుండఁగ ననేక
యుద్ధములందు మహమ్మదీయుల నోడించి చిరకీర్తి నందెను.

# తులసీబాయి.



వర్తకసరణియందును, నాగరికతయందును, మతాచారసంప్రదాయములందును యీప్రపంచమునందు తక్కుంగల దేశములన్నిటిలోను మన యీహిందూదేశ మగ్రస్థానమలంకరించినదనుటకు తార్కాణములు మనదేశచరిత్రములే కదా? ఇట్టి యీదేశమాత కాలానుక్రమముగఁ బెక్కుమతస్థులపాలఁబడి కొంతకొంతకాలము వారిచేఁ బరిపాలింపఁబడుచు మన యీకథాకాలమునాఁటికి మొగలాయీవంశస్థుల యేలుబడిలోనుండి అక్బరుమహాశయునిచేఁ బరిపాలింపఁబడుచుండెడిది. ఈ రాజపుంగవుఁడు తన యుదారస్వభావములందేమి, దేశసంరక్షణమందేమి, మతాచారములందేమి తక్కుంగల తనవంశపురాజు లందరిలోను నుత్తమోత్తముఁ డని పన్నికెక్కెను. రాముని కాలమునఁ బులులును మేఁకలును నొకతటాకమునందే నీరుత్రాగుచుండెడివో యట్లే యీతని రాజ్యమున హిందూమహమ్మదీయసఖ్యత యటులుండెడిది. మహమ్మదు రాజ్యమునకు వచ్చినది మొదలు మొగలాయీరాజ్యవినాశమువఱకును గల కాలములో యీ అక్బరు కాలమునందే హిందువులు భయమువీడి తమతమ మతాచారసంప్రదాయముల నెల్ల పాటింపశక్తిగలవారై, గుండియలపైఁ జేతులువైచికొని సుఖముగా నిద్రించినారు.

ఇప్పటికి సుమారు మూఁడువందల సంవత్సరములకు పూర్వ మొకనాఁటి సూర్యాస్తమయకాలమున మొగలాయీ గుఱ్ఱపురౌతులసమూహ మొకటి రాజపుత్రస్థానపరిసరములఁ బడి పోవుచుండెను. వారు సంఖ్యను రెండువందలు మాత్రమే యుండవచ్చును. కాని వారిఁగాంచినవారికి వారు మిక్కిలి ధైర్యసాహసపరాక్రమవంతులగు యోధులని బోధపడక మానదు. గుజరాతుదేశమును జయింపనుద్దేశించి సైన్యసమేతుఁడై యాదేశముపై దండెత్తిపోయిన అక్బరుచక్రవర్తి సైన్య సహాయార్థ మీసేన పోవుచుండెను. వారు ధరించిన ఆయుధములను దుస్తులను బట్టి ఆదళ మింకను తమనివాసస్థానము వీడి యతిదూర మేగియుండలేదనియు, ఆసేన సరియగు యుద్ధనిబంధనల ననుసరించి తీర్పఁబడినదనియు వారిఁగాంచిన వారికిఁ బోధకట్టకమానదు. మొగలవంశస్థుఁడును, కీర్తివంతుఁడు నగు నొకసరదారుకుమారుఁడు అబ్బాస్‌ఖాను దానికి సేనానాయకుఁడు. అతఁడు కొంచెము పొడవరియైనను మిక్కిలి రూపసి. యుద్ధభూమియందు తన నైపుణ్యమునంతయుఁ గనఁబఱచి చక్రవర్తికి జయమునుఁగూర్ప నాతఁడు కంకణము గట్టుకొనిపోవుచున్నవాఁడగుటఁ బట్టి యౌవనధైర్యోత్సాహములతో బ్రకాశమానమగుచున్న యాతనిముఖవర్చస్సాతని రూపమున కెంతయు వన్నెఁదెచ్చుచుండెను. ఆయోధులలోఁ బెక్కుమందికి యుద్ధభూమికిఁ బోవుటకును, రణ

మున పాల్గొనుటకును నదియే మొదటిపర్యాయము. నాఁడా డకే మూనాఁటిమాధ్యాహ్నమే తమ మార్గమధ్యమందున్న అబ్బాస్ఖానునితండ్రి భవనమును వీడెను.

ఆదలేమున కనతిదూరము నుండి వేఱొక గుఱ్ఱపురౌతులసేనయొకటి దానిఁ దగ్గఱచుచుండెను. ఈసేన శాంతియుతమును, హింసువ్రులతో కూడినదియునై, యుద్ధభూమికేఁగాక ఒకహిందూసుందరి తనజీవితమును జనానాయందును అవరిచితులనడుమను గడుపుటకును, సంసారసాగరమునఁ బ్రవేశించుటకును ఆమెను పుట్టినింటనుండి యత్తవారింట దిగవిడుచుటకై తీసికొనిపోవుచుండెను. పదులకంటఁబడుటకుఁగాని, తాను పోవుమార్గమందలి ప్రకృతిసౌందర్యమాహాత్మ్యములఁ జాటువస్తుసముదాయములఁ గాంచుటకుఁ గాని, పరిశుద్ధమగు గాలిఁ బీల్చుటకుఁగాని వీలులేకుండ చుట్టును తెరలచే కప్పఁబడియున్న యొకపాలకీయుం దామె గొంపోఁబడుచుండెను. దినరాజస్తంగతుఁడగునప్పటికి వారు రోహిణీనదికొద్దనే యొక శ్మశానవాటికగుండ పోవుచుండిరి. దొంగలగుంపొకటి హఠాత్తుగ వారిమార్గమున కడ్డుదూరి యాయువతి సహాయార్థము పోవుచున్నకొద్దిరాజపుత్రులను చెల్లాచెదరు గావించి, పాలకీని సమీపించి యందున్న యువతీలలామను బైట కీడ్చిరి.

తులసీబాయి భయవిహ్వలచిత్తయై తన్నుచుట్టిముట్టి
యున్న భయంకరరూపులఁ గాంచెను. పాప మాయువతికి
వయసు పదునేను వేసవులు మాత్రమే. తలిదండ్రుల కొక్క
తెయే బిడ్డయగుటఁజేసి తనపుట్టినింట కడుగారాబముతోను,
ముద్దుముచ్చటఁతోను, జాగరూకతతోను నామె పెరుగుచుం
డెడిది. హఠాత్తుగ నొక్కసారి క్రూరులును మోటుజాతివా
రు నగు దొంగలకు స్వాధీనయాటచే నామె దిక్కులి దిగు
లొందెను. అటవికకురంగివలె నమాయికయగు నాబాలిక
వారలఁ గాంచి తాను చిన్ననాఁడు చదువుకొనిన కథలలోని
రాక్షసులేమోయని భ్రమించెను. క్రూరులును మృగప్రా
యులు నగుటచే వారలకు నామెసౌందర్యమును, చూపులందలి
తేజస్సు నావంతయు గోచరింపకపోవుటయే కాక, యామె ధరిం
చియున్న విలువైన యాభరణము లన్నిఁటిని దీసి తమస్వాధీ
నముఁ జేయ వా రామెకు కఠినముగా నాజ్ఞాపించిరి. అబలయు,
మృదులమనస్కయు నగుటచేత యాభరణములను తీసియిచ్చు
టకు సహితము వీలులేనంత యెక్కువగా నామెచేతులు వ
ణఁక నారంభించెను.

అబ్బాస్ఖానుఁడను, నాతని సేనయు నచ్చోటికి వ
చ్చుటయే తటస్థింపకపోయినచో, రాతికంటెను కఠినములగు
వారిమోటుచేతు లామెపైఁ బడి యాభరణములు మాత్రి
మేకాక నామెధరించిన జరీయుడుపులఁగూడ విదళించియుం

డును. ధైర్యశాలురతో కూడియున్న యాసేన నెదుర్కొనుటకు శక్తిలేక యాదొంగలదండు కొండలు మొగలులచే దరుమఁబడి పిక్కబలము చూపెను. తన్నుచుట్టు ముట్టియున్న ఘోరవిపత్తునుండి రక్షింపఁబడితినికదా యని మనసు కుదురుపఱచుకొనుచు దురదృష్టదేవతవలె తులసీబాయి యచ్చోటనే నేలపైఁ గూర్చుండియుండెను. దొంగలే రాక్షసులగుట తటస్థించినచో నిశ్చయముగ వారిఁ దామె నదరింప నవతరించిన భగవంతుఁడనియే చెప్పవచ్చును. తనరక్షకుఁడు తన్నసమీపించినక్షణమునుండి యామెమ ఖమునందు నూతనవికాసము పొడకట్టెను. వీరత్వమును చాటు వానిని సర్వాంగకవచ మావని:జరూపమున కెంతయు వన్నెఁదెచ్చుచుండ సుందరమైన యాతని రూపమువంటి రూపమును మానవరూపములలో నింతకుముం దామె మరియెచ్చటనుగాంచియుండుట కాని, పెండ్లిదుసుల ధరించి మూర్తీభవించిన మోహనదేవత రోయాయన మృదులమైన చూపులతో తనముందు కూర్చుండియున్న తులసీబాయివంటి అత్యద్భుతసౌందర్యరూపము నాతఁడిదివఱ కెన్నఁడు చూచియుండుట కాని తటస్థించియుండలేదు.

అప్సరసయేమోయని భ్రమింపఁజేయునంతటి రూపవతియగు నామెఁ గాంచి యాతఁడు మోహాతురుఁ డయ్యెననుటయం దాశ్చర్య మేమున్నది. అతిశ్రద్ధావినయములతో

వానిఁ డాపెను పల్లకిలోనికిఁ బంపెను. అతని హృదయము నుండి యెన్నోకోరికలుప్పొంగుచుండెను. తనతండ్రి భవనమునకుఁగాక, ప్రపంచముతో సంబంధములేని మఱియేయితరారణ్యప్రదేశమునకుఁగాని కొంపోయి యామెతో సుఖముగా కాలము గడుపఁగలశక్తి యాతనికి కలదు. కాని హఠాత్తుగ నాతనిహృదయమున నొక పెద్దమేలపు మెఱసినట్లయ్యెను. తాను సేవించుచున్నచక్రవర్తియాజ్ఞ నాదలఁదాల్చి తనయోధగౌరవమును నిలువఁబెట్టుకొనుటయా? లేక ఆపదఁబడిన దురదృష్టవతియగు నొకబాలికరక్షణయం దప్రమత్తుఁడగుటయా? యను విషయములం దేదినిర్ణయించుటకును వానిఁ డశక్తుఁ డయ్యెను. ఆలోచనాపరంపరలతో హృదయము చాల కలఁతచెందెను. తుదకు గౌరవమే జయముఁగాంచెను. అంతలో తులసీబాయిసహాయార్థమై వచ్చినయోధులు తాము దాఁగొనియున్న స్థలములనుండి యచ్చోటికి వచ్చిరి. హృదయ మెంతపరితపించుచుండినను అబ్బాస్‌ఖానుఁడు తుదకు రాజాజ్ఞను నెఱవేర్చుటే ముఖ్యమని నిశ్చయించుకొనెను.

ఆలోచనాసముద్రమున నీఁదులాడుచు అబ్బాస్‌ఖానుఁడు తనయశ్వము నధిరోహించి తులసీబాయిపల్లకి వెనుకనే బయలుదేఱిపోవుచుండెను. అతఁ డామెఁ జూచుటకు వీలుకాదు. కాని యాతనినామె తెరలసందునుండి తొంగితొంగి

చూచెసిది. చూచినకొలందియు సుందరుఁడైనయా నూతన
పురుషునియం దామె కనురాగమును, మోహము నెక్కుడ
య్యెను. తుదకు వారు తమతమ నియమితస్థలములకుఁ బోవు
బాట లొకదానినుండి వేఱొకటి విడిపోవుస్థలమున కరు
దెంచిరి. అంత నామె యతిసాహసముతో పాలకీతెరలను
తొలఁగించి తన్ను దొంగలబారినుండి రక్షించినయావీరుని
హస్తములం దొక యంగుళీయకమును జారవిడచెను. మో
హాతురులగు స్త్రీపురుషు లొండొరుల నెట్టిచూపులతో
చూచుకొందురో యట్టిచూపులఁ దుదిసారి వా రొండొరుల
పైఁ బరపుకొని తదేకదృష్టితో, జీవితమనెడి సాగరమున
మానవస్వాభావికములనెడి అలలయందలి మోహమనెడి క
రటములచే వా రొండురు లెడఁబాపఁబడిరి. జయమును, కీర్తి
యుఁ, గాంచుటకు యుద్ధభూమి కాతఁడును, తనజీవితమును
కీర్తిమంతముగ గడపవలసినయత్తవారింటి కామెయు పో
యిరి. తా నాచరించిన కార్యమున కామె శిక్షాపాత్రమైనను
ఆశిక్షయనెడి భీతిచే తన్ను రక్షించినసుందరుఁడగు యువకుని
ప్రతిబింబము నామె తనహృదయమునుండి తొలంగింపఁ
జాలదు. వివాహవతియై తన హిందూగృహమునం దామె
సంతానవతియైన యొకసంసారిణియై యుండినను నామె
హృదయమునకు సంతోషము నిచ్చునాలోచనలందు, తన
రక్షకుఁడగు నాపురుషపుంగవునిఁగూర్చిన యాలోచన లగ్రస్థా

వను వహించును. అతని కామినిమూర్తి యెన్నటికిని మఱపు
నకు రాదు. తన జీవితమునం దాతఁడు తులసీబాయినే మో
హించెను. శాంతియుతమైనసమయములందైనను, యుద్ధ
భూమియందైనను, కష్టసుఖములయందైనను, వాతని హృ
దయము తాను దొంగలనుండి రక్షించినహిందూసుందరిం
గూర్చిన యాలోచనలతో నిండియుండును.

ఒకసంవత్సరము గతించెను. సూరత్ నగరసామీప్య
మున మిార్జావంశస్థులకును, మొగలులకును జరిగినయుద్ధములో
అబ్బాస్ ఖానుఁడు అక్బరుచక్రవర్తి పక్షమునేయుండి రణరంగ
మున భయంకరముగా విజృంభించి తన ధైర్యసాహసములఁ
జూపించెను. యుద్ధము ముగిసెను. జయలక్ష్మి మొగలాయి
చక్రవర్తినే వరించెను. సేనాసమూహములు గృహోన్ముఖ
ములయ్యెను. యుద్ధభూమియందు తాను చూపిన ధైర్యసా
హసములకు కానుకగా నొసంగఁబడిన అరబ్బీదేశపుగుఱ్ఱము
నెక్కి అబ్బాస్ ఖానుఁ డొకనాఁడు గోహాణీనదియొడ్డున మఱ
లపోవుచుండెను. యుద్ధభూమియందు తనతండ్రి వీరస్వర్గముఁ
గాంచుటచే పితృసంస్థానమును గ్రహించుట కాతఁడు నిజనా
సమున కేగుచుండెను. ఈసారిమాత్ర మాతనిహృదయసీ
మను సంతోషచిహ్నము లేమియుఁ బొడకట్టలేదు. ఏ యువతీ
లలామను తా నిదివఱకు రక్షించి, మోహించి, క్షణమాత్ర
మేగాంచి, అటుపైని తన జీవితాంతమువఱకు మరలఁ గాంచ

భాగ్యమునకు నోచుకొనక నెడఁబాసియుండెనో యాపుత్రిదేశమున తా నపుడు పోవుచుండుటచేతను, తన జీవితమునంతను నిఁకముం దొంటరిగా తన భవనమున గడుపవలయు ననెడి భీతి చేతను, వాతఁడు విచారనిమగ్నమానసుఁడై యుండెను. సుఖసమయములం దాతఁడు తన చరిత్రనుగూర్చి యోచించుకొనిన, జీవితానంతర మందునది తాను సంపాదించినగౌరవమును, కీర్తియుమాత్రమే కలదికాలములో యావనమును ధైర్యమును విచారమునుండి యాతని విముక్తునిఁ జేయఁగలవు. కాని రోహిణీదీపాంతమున నొంటరిగా పోవుచున్నపుఁడాతనిహృదయాసీమయందు దుఃఖదేవత యగ్రస్థాన మలంకరించి పాలించుచుండెను. తుదకు వాతఁ డధిరోహించినయుత్తమాశ్వము సహితము తనప్రభునోవేదనకు సానుభూతిఁ జూపుచున్నదో యనునంతమందగమనముతోఁ బోవుచుండెను.

అటుపోవుచు తదేకధ్యానపరుఁడైయున్న యాతఁడు దహనసంస్కారమునకై శ్మశానవాటిక కొకశవముఁ గొనిపోవుచున్న హిందూజనసమూహము నొకదానిఁ గాంచెను. ఒకబాలునిశవ మొకవాహనమునం దుంచికొని పోఁబడుచుండెను. దుఃఖనిమగ్నులగు బంధుగులు, స్నేహితులును పెక్కు రుండుటఁ బట్టియు, మృతకళేబరమునకు కప్పఁబడిన దుస్తులు మిక్కిలి విలువగలవియై యుండుటచేతను, మృతుఁడైనబా

లుఁ డొక గొప్పకుటుంబములోనివాఁడని యూహింపవచ్చు
ను. శవవాహకులు వెలలేని పట్టువస్త్రములఁ దాల్చిన వలు
రహింకువులు దుఃఖమును సూచించుదుస్తులను ధరించి
శవవాహనముముందు పెక్కురు రామనామోచ్చారణ ము
నర్పుచు మధ్యమధ్య ధాన్యమును, రూకలను శవముపై వెద
జల్లుచుఁ బోవుచుండిరి శవవాహనమునకు ముందున్నవారిలో
మొదటివాఁ డొకమృణ్మయపాత్రములో నగ్నిం గొనిపో
వుచుండెను. ఆనిప్పునే శవదహనమున కమర్పఁబడినచితి నం
టించుట కుపయోగింతురు. తుద కాజనసమూహము శ్మశా
నవాటికఁ జేరెను. అచ్చట జరుగుచున్నచర్య నంతయుఁ
గాంచిన "సతి" (సహగమనము) యను నాచారము నచ్చో
ట జరుగనున్నట్లు పొడకట్టుచుండెను. సహగమనమున, భర్తృ
మరణానంతరము భార్య తనభర్త గౌరవము నిలువఁబెట్టుటకై
తనపతిని దహనము చేయుచితియందే పడి తానుకూడ మర
ణించుట కఠినమైన యీయాచారము పూర్వము హిందువు
లలో నుండెడిది. కాని రానురాను కొందఱు మహాపురుషు
లీయాచారము నంతమొందింప యఖండప్రయత్నములు గా
వించి జయముఁగాంచిరి. శవముంచఁబడినచితిసమీపమున
నొకయువతి తానుగూడ నాచితియందుఁ బడి యగ్నిదేవుని
కాహుతియగుటకు సంసిద్ధయై నిలుచుండెను. ఆమె మృతుఁ
డైన యాబాలుని ధర్మపత్నియే యైయుండును. మొగలాయి

ప్రభువులలో నుత్తమోత్తముఁడని మిక్కిలి ఘనతకెక్కి శాశ్వతకీర్తిఁగాంచిన అక్బరుచక్రవర్తి తన జన్మకాలమున కతి వముగు సీయాచారమును రూపుమాపనెంచి ఏహిందూ కులకాంతయైనను తనకిష్టములేనిచో సహగమన మాచరింప నవసరము లేదని శాసనముఁగావించెను. ఉదారాశయములం దును, న్యాయప్రవర్తనమునందును అక్బరుచక్రవర్తితో సమా నుఁడై, యావన ధైర్యోత్సాహముల కాలవాలమైనఅబ్బాస్ ఖానుఁ డచ్చోట జరుగుచున్న సంగతి నూతయుఁ గాంచి యచ టి బ్రాహ్మణులందఱు తనప్రభుశాసనము నుల్లంఘించుటకు సంసిద్ధులైయున్నారని గ్రహించి దుఃఖితులతో నిండియున్న యాశ్మశానవాటికఁ బ్రవేశించెను. సహగమన మాచరించు టకు సంసిద్ధమై యున్న యాయువతి వత్సరము క్రిందటరోహి ణీనదీప్రాంతమున తనచే రక్షింపఁబడినకన్యయే యని గ్ర హించినపుఁ డాతనిహృదయము నేమనివర్ణింపఁగలము! తుల సీబాయిభర్త పిన్నవయసువాఁడును, రోగపీడితుఁడు నైనబా లుఁడు. ఆమె కాతనియం దమితమగునుక్కవ. ఆతనికామె యం దపారమగుప్రేమ. తుదకాతఁడు తన జబ్బులో మందు కూడ నామెచేతులనుండియే కాని మఱొకరిచ్చిన పుచ్చుకొ నెడివాఁడు కాఁడు. పాపము జ్వరమాతనిని చాలకాలము కష్ట పెట్టి హఠాత్తుగా నచ్చి మృత్యువాతఁ బడవేసెను.

ఎట్టిమానవునకైనను మృత్యువన్న భయమేకదా! పుట్టుట గిట్టుటకొఱకే యనునట్లుగ నెప్పటికైనను చావు తప్పనిదే యైనను మరణకాలమందు మఱికొంతకాలము బ్రతుకవలయునను నాశ యుండుట సహజముకదా! శతవత్సరప్రాయుఁడైన ముసలికైనను, చిరకాలరోగపీడితుఁడై, సుక్కి, కృశించి, కల్యమాత్రావశేషుఁడై యిఁక గడియలలోనో, రోజులలోనో మృత్యుదేవతకు బలికానున్న వానికైనను మఱికొంతకాలము జీవించిన బాగుండు ననునాశయుండునుకదా! అట్టియెడ, రూపవతియు, నవయౌవనవతియు, పారవంచికసుఖములం దించుకైనను తనివిదీరనిగోలయునగు నొకనారీమణికి; తనజీవితము సౌఖ్యదాయకముగా గడువవలసిన భవిష్యత్కాల మెంతయోయుండ, బలవన్మరణమునందు కోర్కె యుండునా? పాపము. విశంతువగుతులసీబాయి కింకను జీవించవలయు ననునాశ యున్నది. కాని లాభమేమి? ఆమె బ్రతికియున్నను మరల వివాహము కావించుకొనుటకు మతాచారధర్మము లెంతమాత్ర మొప్పవుగదా! వర్ణాశ్రమధర్మములను మతాచారసంప్రదాయముల నుల్లఘించకుండుటయందు హిందువులు మిక్కిలి పట్టుదలకలవారుకదా! పరిమళసుగంధతైల మర్దితములై, వివిధపుష్పమాలాలంకృతములౌ నామెకురులిఁక యుండనేరవుకదా! అమూల్యాలంకారభూషితమై విలువగల జరీవస్త్రులను ధరించు నామె యింత

టినుండి వైధవ్యమును సూచించు తెల్లనివస్త్రములను ధరిం పవలయునుకదా! తనభర్తమరణమునకు తాఁ దివఁటకెన్నఁడో చేసిన పాపకృత్యములే కారణములని పరులామెమును ఖమునఁగాం చుటకైనను నసహ్యాపడుచుందురుకదా? మూఁడు తన జీవిత మిట్టివిధముగా నుండుననియెఱింగియున్నపుడామె యాబ్రా హ్మణులవచనములకు చెవియొగ్గి, దుర్భరముగఁబ్రతుకు బ్రి తుకుటకంటె సహగమనమే మేలని తలంచుటయం దాశ్చ ర్యమేమున్నది? అందువలన హిందూయువతులు భర్తృమర ణానంతరము సహగమన మాచరించి తమపతులయందలి గౌ రవమును, నత్యంతానురాగమును వెల్లడిచేయుదురు. అటులే యామెయు శాంతియుతమైన ధైర్య మవలంబించి సహగమన మాచరించి భయంకరమృత్యువాతఁబడ నంసిద్ధయై యుండె ను. తుదిసారి యామె సర్వాభరణవస్త్రాలంకారభూషితయ య్యెను. అచ్చోటి విప్రులందఱు సహగమనానంతర మామె శరీరమందలి బంగారు నెరకొనుట కువ్విళ్ళూరుచుండిరి. అట్టి సమయమున అబ్బాస్‌ఖానున కామె, నిశ్చలమై, నిర్మలమై పాలరాతితో నిర్మింపఁబడిన యొక ప్రతిమవలెఁ గన్పట్టెను. తనజీవితపరిమాణములో మరల నన్నులాఁగాంతుననుత లంపైనను లేని ఆయువతి యతనిఁగాంచినంతనే నవపులకాం చితతనువల్లియై సముజ్జ్వలప్రకాశమానయయ్యెను. ప్రేమం చికసుఖానుబంధముల నన్నిటిని తెగద్రెంపుకొని యంత

చిన్నవయసులో మృతినందుటకంటె జీవించియుండుటే మేల
ను నాశ యామెహృదయసీమఁ బ్రవేశించి కలంచుచుం
డెను.

వత్సరమునకు పూర్వ మామె సౌకుమార్యమగు బా
ల్యావస్థయందున్న బాలిక. ఇపుడన్ననో సుందరమగు యవ్వ
నావస్థయందున్నయువతి. అబ్బాస్‌ఖానున కామెసౌందర్యమం
దలి ప్రేమకన్న నామెదురదృష్టమే యెక్కుడాశ్చర్యమును
కలుగజేసెను. క్షణమాత్రమున నచ్చటి స్థితిగతులగ్రహించి
యచ్చటిబ్రాహ్మణులలో పెద్దయగువానియొద్దకు గబ్బుము
నైఁబోయి యాతఁడు బలవంతమగు సహగమనమును మా
న్పఁగావింపఁబడిన రాజశాసనము నెఱింగించెను. అంత
నచ్చోట నీక్రిందిసంభాషణ జరిగెను.

బ్రాహ్మ—ఆవిషయమామెనే యడుగవచ్చును".

ఖాను—(తులసీబాయివైపు తిరిగి) ఏవితంతువు గాని
తనకిష్టములేనిచో సహగమన మాచరింప నక్కఱలేదనిచ
క్రవర్తిశాసనముఁ గావించియున్నాఁడు. అందువలన నీవు నీ
యిష్టానుసారమే యీభయంకరమృత్యువువాతఁబడుచుంటి
వా? లేక బలాత్కరింపఁబడుచుంటివా?"

ఈకలుకులువిననతోడనే అదృష్టవిహీనయగు నాయు
వతికి ప్రాణములపైఁ గోరిక యతిశయించి తనరెండుచేతు
లఁజాచి యామోధునితో నిట్లనియె.

తుల—"నాథప్రభూ! తమ రెండవతూరి నన్ను రక్షించియున్నారు. తమకు శక్తియున్నచో క్రూరులగు వారి బారినుండి యిపుడుకూడ నన్నురక్షింపుడు. కాని వారు నామృతి కెదురుచూచుచున్నారు నాగాలకు వారినెదురించినచో నాకనులయెదుట మిమ్ములనుగూడ కడతేర్తురు. అదిచూచి నే భరింపజాలను. నాగతియెటులున్నదో యట్లుకానిమ్మనదు. కావున త్వరితముగా తమరిచ్చోటు వాసిపొండు"

తులసీబాయిప్రార్థన వినినతోడనే ఖానుఁడు మృత్యుముఖమునఁ బడనుండి వివ్వాలచిత్రయాటచే నాకు యందులకియ్యకొననే కాని హృదయపూర్వకముగ సమ్మతించి యుండలేదని గ్రహించి, యీయుదంతము నామిత్రులతోఁ జెప్పెను. అంత నా బ్రాహ్మణులు చితినుండి కట్టెలుదీసి తమ కార్యమున దేవమాత్రము జోక్యము కలుగఁజేసికొన్నను నాయోధుని చిదుకమొత్తుటకయి సంసిద్ధులై యుండిరి. ఇదిగాంచి ఖానుఁడు తనయశ్వమును తులసీబాయిసామీప్యమునకు నడిపించి మెల్లన నామెతో నిట్లనియె.

ఖాను—నే నశ్వము నవరోహింతునా మనమిద్దరము నశింతుము. కావున నీకుడిపాదమును రికాబునందుంచి నా కుడిచేయి నానుకొని నా వెనుకరమ్ము. అంత రయమున నిన్నెక్కించుకొని గుఱ్ఱమును దూకింతును. ఈక్రూరరాక్షసులబారినుండి నీవు విముక్తినందెదవు."

ధైర్యశాలినియగు నాయువతి యాతనియాలోచనకు మిక్కిలిహర్షించి యాతఁడాజ్ఞాపించినట్లొనర్చిన క్షణమాత్రము నావీరుఁడు తనయుత్తమాశ్వమును జనసమూహమధ్యమునుండి తెలియకుండనిపోయెను.

రుద్రభూమిని వీడి యతిదూరము జనకపూర్వమే వా రిరువురి యొకమహావిపత్తునఁ బడిరి. శ్మశానవాటికయందు ఘటిల్లినదంతయుఁగాంచి మొగలయోధుని నెదుర్కొనవచ్చుచున్న యిర్వురు రాజపుత్రవీరులు దారి కడ్డుదూరి అబ్బాస్ఖాను నెదుర్కొనిరి. అతిసాహసముతోను, నైపుణ్యముతోను ఖానుఁడు వా రిర్వురఁ బడమార్చి యువతి కాలములో తనతండ్రిభవనముఁ జేరెను. తరువాత కొలదిదినములలోనే యామొగలయోధుఁ డాయువతిని పెండ్లియాడెను. "సతి" యన్నఁ గిట్టనితుల సీబాయితండ్రి తనముద్దుకూఁతురు గావించినసాహసకార్యము విని మిక్కిలి సంతోషించెను. యుద్ధభూమియందు చూపిన కౌశలమునకును, "సతి" యను దురాచారమును మాన్పుట కందు ప్రదర్శించిన ధైర్యసాహసములకును, చక్రవర్తి ఖానుని కీర్తించి యాతని కనేకబిరుదులను, జాగీరులనొసంగి యాతని నొకగొప్ప దళవాయి (సేనానాయకుఁడు) గా నొనర్చి సత్కరించెను.

---

# అహమ్మదుషా.



ఘుషానపాయగు అహమ్మదుషా వేసవిరోజులలో రాజధా[illegible]చి రజతసరోవరప్రాంతముననే నిర్మింపఁబడిన శీతలసౌధ[illegible] కాలము గడపుచుండెడియలవాటు. అహమ్మదుషా [illegible]సపోషకుఁడు, కళాపోషకుఁడు, సుందరాంగుఁడు, స్ఫురద్రూపము నగు యువకుఁడు. ఒకనాటిరేయి శీతమలయానిలుఁడు [illegible] సింధుకాంతిని ద్విగుణంచముగ విదజల్లుచున్న సమయ[illegible] అహమ్మదుషా తనప్రియమైన చిన్నినావపైఁ విద్యాధి[illegible] కొందఱు గాయకులతో రజతసరోవరమున నౌ[illegible]విహారము సలుపుచుండెను. అట్టితరి మహమ్మదీయగా[illegible] లొకరివెనుక నొకరు తమప్రభువు సంతోషముచే మై[illegible]నటి యింపుఁగూర్చు గానము సల్పుచు ప్రభువిజయస[illegible]మాలగు యుద్ధగీతికలఁ బాడుచుండిరి. వారి తరువా[illegible]క హైందవగాయకుఁడు గొంతెత్తి, సుకుమారియు, సీ[illegible] సౌందర్యరాశియునగు నొక రసపుత్రవీరనారీమణిచ[illegible] సంబంధించినగీతికలఁ బాడుచుండెను. సంతోషసాగ[illegible] స్వేచ్ఛావిహారము సల్పుచున్న యట్టిచల్లనివేళ నా[illegible]లయందలి యద్భుతభావముల వీనులార యాకర్ణించి నా[illegible]షా తచ్చరిత్ర సంబంధముగల నాయికయందు మోహా[illegible]మగ్నుఁడై యీక్రిందివిధముగా ప్రశ్నించెను.

"అట్టి నారీరత్న మేకాలమునాఁటిది?" "ఆమె యిప్పుడుజీవిం చియేయున్నది! ఇంకను యవివాహిత. నే పాడునది సౌందర్య రాశియు, రజపుత్ర వీరనారీమణియు, పర్బత్ సింగుకొమరిత యునగు లాలాచరిత్ర" యని యాగాయకుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. "ఆమె నీవువర్ణించునంతటి సుందరాంగియే యైన చో విధిగ నాకు భార్యకావలెను." యని యనుచు పాదుషా యాలోచనానిమగ్నుఁడై నావను సౌధమునకు మరల్చు మనెను.

మరునాఁ డహమ్మదుషా తన బ్రాహ్మణకార్యదర్శిని రావించి 'లాలా'నుగూర్చి యడుగఁగా యాబ్రాహ్మణుఁడా హైందవగాయకుఁడు వర్ణించినదానికన్న నెక్కుడుగ లాలాను గూర్చి చెప్పగా పాదుషా తృప్తిఁజెంది యెంతమాత్ర మాల సింపక లాలానుగుఱించిన తనయిచ్ఛను పర్బత్ సింగుతో నివేదించుట కా బ్రాహ్మణునిఁ బోనాజ్ఞాపించెను. కాని యాతని మోహము హృదయారాపమును దాల్చలేదు. కొందఱు రాజ పుత్రులు ధనోద్యోగవాంఛితులై తమకూఁతుండ్రను అహ మ్మదుషాకును, ఆతనిప్రధానులకు నర్పించియుండిరి. కాని రజపుత్ర వీరాగ్రేసరుఁడగు పర్బత్ సింగు తన నిష్కళంక మగు వంశమున కట్టికళంక మాపాదించియుండలేదు. తన కొమరిత నాపాదుషా కిచ్చుటచే నామె గౌడచక్రవర్తి యగును. కాని మహమ్మదీయునకామె నిచ్చుతలంపు

వాతఁ డసహ్యించి, షామసాకోర్కె నిరాకరించి, పర్వత
ప్రాసాదమును 'అహారు' దుర్గమునకుఁబోయి, తనబంధు
సామంతాదులరావించి, తనకును షామసాకును జరుగఁబోవు
సమరమున తోడ్పడునట్లుగా వారిచే వల్లె యనిపించుకొనెను.

అహమ్మదుషా యీవర్తమానము విని యుగ్రుఁడై
యుద్ధసన్నద్ధుఁడై పట్టపుటేనుఁగుపైఁ నలంకరింపఁబడిన వెండి
యంబారిపైనెక్కి లాలాకొఱకై యింకొకయేనుఁగు నలంక
రింపించి, యుద్ధందులగు పదివేలసైనికులకు తానే యధిపతి
యై, యాపర్వతప్రాసాదమును శిథిలమొనరి తనపెండ్లికూఁతును
స్వాధీనముగా దీసికొనివచ్చుటకై బయలువెడలెను. అతిధై
ర్యోత్సాహములతో అహారుప్రాసాదమును సమీపించి
ప్రాసాదప్రవేశమునకై గోనికిఁ గబురుచేసెను. దానికి జబా
బుగ చీటి కట్టఁబడిన యొక బాణమువచ్చి యంబారీశిఖరము
నకుఁ గ్రుచ్చుకొనెను. ఆకాగితమునందీవాక్యములున్నవి "ఈ
బాణమును విడచినయోధుఁడు దుర్మార్గపు తలంపుతో లాలా
నువరించి వచ్చిన నీతలగూడ ద్రెళ్ళవేయఁగలఁడు. కావున,
చెడుగుజరుగకపూర్వమే నీవచ్చినదారిని వెనుకకు మఱలు
ము." ఆసమయమునకే వధువునకు బహుమానముగ అహ
మ్మదుషాచే పంపఁబడిన విలువగలబట్టలమూట యాతఁ
డధిరోహించిన యేనుఁగుముందర పడెను. ఆరీతిగ యుద్ధము
ప్రకటింపఁబడెను.

అహమ్మదుషా పెండ్లి యీవిధమైన ఘోరముగా పరిక్రమించెను. పాదుషా పెండ్లికట్నముగా ఆకాశించిన ధన పునంచుల నస్పుంటిని వెద్పించి దుర్గసంరక్షణార్థ వలయు సర్వసమేతసంభారముల సమకూర్చుకొనిరి. ధైర్యసాహసోపేతులగు మూడువేలయోధులు అహోరాత్రము దుర్గరక్షణార్థమై నియమింపఁబడిరి. వారు విరోధిసేనవచ్చి ప్రవేశము న కొనర్చిన సర్వప్రయత్నములు ధ్వంసముచేసి దుర్గ పాళికారముల నెగబ్రాకుప్రయత్నమునందుఁగూడ విఫల మనోరథులఁ జేసిరి. అందువలన విరోధిసేనకు దుర్గప్రవేశము నకు కొంత వ్యవధి కావలసివచ్చెను.

రెండుమూడుమాసము లగునప్పటికి కోటలో ఆహార పదార్థములన్నియు క్రమముగా తఱిగిపోయెను. కోటనుండి లోనికాహారపదార్థములు వచ్చుమార్గ మేదియు లేదు. పర్బత్ సింగు తనకూఁతును పాదుషాకిచ్చుటకే యంగీకరించి యుండినయెడల నింతటిముప్పు వాటిల్లక విషయము లు సుఖ దాయకములుగ నుండెడివి. కాని, రసపుత్రులు గాత్రము విరోధులకొడి వారికి శాసనులై జీవించియుండుట కం టె మరణ మే శ్రేయోదాయకమని యెంచి స్థిరచిత్తులైరి. స్త్రీలందఱు నప్పటి దేశాచారమగు 'జోహారు' సలుప కృతనిశ్చితలైరి. 'జోహారు'నగా నొకపెద్ద యగ్నిగుండము నాయత్తముఁజేసి ముందుగ స్త్రీలందఱు నాయగ్నియందుఁబడి మరణించు నొక

యాచారము. పిదప పురుషులు యుద్ధభూమికిం జని శత్రులం
జయించుటయో, తోడి యుద్ధభూమిని హతులగుటయో తట
స్థించుచుందురు. మహమ్మదీయులకు బానిసలై బ్రతుకుటకం
టె చచ్చి వీరస్వర్గమునకేగుటయే సుఖదాయకమని కృత
నిశ్చయులై నాంటిరాత్రి ప్రాసాదమధ్యమున నొకపెద్దయగ్ని
గుండమును రగుల్కొలిపి మొదట నాభరణములను, పిదప
పసిబిడ్డలను అనంతరము స్త్రీలు సంప్రవేశించి వీరస్వర్గముం
జూరగొనిరి.

మఱునాండుదయమున శూరులగు నుత్పదివందల
యోధులు సమయోచితములగు వస్తుల ధరించి పూజనీయ
ములగు 'తులసి' 'సాలగ్రామము'లం ధరించి యుద్ధమునకు
సిద్ధముగానుండిరి. అంత దుర్గద్వారములు తెఱవంబడెను.
యువరాజగు రామసింగుతో షర్బత్ సింగు స్వయముగా సే
నానాయకత్వమును వహించి తక్కుంగల యోధులతోం బా
దచారులై శత్రువులగుడారముల నడుమనున్న షామహా
గుడారమునకుం బోవుచుండిరి. రాజయువరాజులు తమకుచిం
తాలంకారములగు సమరోచితరాజవసనాభరణాదులు ధరించి
దారిలోనున్న శత్రుసేననంతయుం జెల్లాచెదరుగావించుచు ర
నపుత్రులు తన్నుం జేరవచ్చుటం జూచి అహమ్మదుషా యేనుం
గుపై నమర్పంబడిన హౌదాపై నెక్కి. సేనామధ్యమునకు వ
చ్చెను. శత్రుసేనలు చెల్లాచెదరై యుండుటచే రసపుత్రి

లు పాదుషాను సమీపించుచుండిరి. దారిలోఁ శత్రులనెల్ల నఱుకుమాడుచు వారెట్టకేలకు పాదుషాను సమీపించిరి. అహమ్మదుషా యపుడు చచ్చుటయో లేక బందీకృతుఁడగుటయో తప్ప వేఱుమార్గము కాన్పించదు.

తనచుట్టును మహమ్మదీయులు పోరుచున్నను రామసింగు అహమ్మదుషా యెక్కిన యేనుఁగును సమీపించి దాని కడుపు క్రిందిభాగమున కట్టఁబడిన యంబారీత్రాళ్ళను దెగగోసెను. అంత నాయంబారీ తలక్రిందుగా క్రిందఁబడుటయు పాదుషా నేలపై మట్టిలోఁ బడి దొఱలుటయు తటస్థించెను. రామసింగును, ముందున్న మఱియిర్వురు రాజపుత్రులును లేడిపైఁబడు కొదమసింగమువలె పాదుషాపైఁ బడిరి. కాని చంపఁజాలకపోయిరి. ఇట్లు పెనఁగులాడుచున్న సమయమున నితరస్థలములయందున్న మహమ్మదీయసేన లరుదెంచి రసపుత్రులఁ జుట్టుముట్టి నఱుకమాడ మొదలిడెను. అటుల దినమెల్ల పోరుసాగెను. ఆనాటి యుద్ధభూమియందు పర్బత్ సింగును, రామసింగును ప్రళయకాలరుద్రులవలెఁ బరాక్రమించిరి. కాని తుదకు జయలక్ష్మి మహమ్మదీయులనే వరించెను. మహమ్మదీయులబల మెక్కుడగుటంజేసి రాజు; యువరాజులతో సహా తక్కుంగల రసపుత్ర యోధులందఱు హతులైరి. ఆనాఁడట్టులపోరు రసపుత్రయోధాగ్రేసరులందఱు నస్తమించిరి. అహమ్మదుషా అరక్షితమగు నాకోట ప్రవేశించు

నప్పటి కచ్చోట లోపల వెలుపల శవములుదక్క వాతని కేమియుఁ గానరాలేదు. ఇట్లే రజపుత్రవీరు లెన్నియోసారు లు తమ స్త్రీల నగ్నిదేవున కర్పించి మగలయుద్ధభూములందు తమమానములఁ గాపాడుకొనియుండిరి.

తనపెండ్లిప్రయత్నమునకై జరిగినముచ్చటలఁ జూచి అహమ్మదుషా మిగుల విషాదముఁజెందెను. దాని తరు వాత రక్కనజవానాతోపాటు 'లాలా' అహోరుదుర్గములో మృత్యుదేవత కాహుతియై యుండలేదని తెలిసికొనెను. మఱి ల నాతనికోర్కెలు చిగురింప నారంభించెను. కోటముట్ట డింపఁబడుటకుముందే నమ్మకమైన యింకొకరాజదుర్గమున కు ఖర్బత్ సింగు లాలాను పంపివేసియుండెను. ఆసంగతి అ హమ్మదుషా విని పిదప లాలాయున్నరాజదుర్గము నాతఁడు ముట్టడించి లాలాను తన వశ మొనర్చునట్లుగా లోనికిఁ గబు రంపెను. ఆదుర్గాధిపతి తనప్రాణావసాన మగువఱకు పాదు షా నెదుర్కొందునని సిద్ధపడుచుండ లాలా వలదని వారించుట యేగాక, పాదుషాను పెండ్లియాడుట కనుమతించి, జరీపని చేసినట్టివియు, రత్నఖచితములగు విలువగల దుస్తులను పెండ్లి సమయమందు ధరించుటకై పాదుషాకు కానుకగాఁ బంపె ను. తనతండ్రిని, సోదరునిఁ జంపుటయేకాక తనవంశమునంత ను నిర్మూలించిన యాదుర్మార్గుని వివాహమాడుట కనుమతిం చిన లాలాయొక్క బుద్ధిమాంద్యము నచ్చటి మిగతగల రస

పుత్రు లసహ్యించి యుండకపోలేదు. కాని యెవరిమట్టుకు వారు లటస్థముగా నూరకుండిరి.

రజతసరోవరముప్రక్కనేయున్న పాదుషాసౌధపు ముందువాల్లో వివాహమహోత్సవము జరుపుటకు నిశ్చయింపఁబడెను. అన్నివిధములచేతను సంతోషకరమైనది కావున నుత్సవములు చాల గొప్పగాఁ జేయఁబడి సర్వప్రయత్నములు చేయఁబడెను. హిందూమహమ్మదీయసఖ్యత పెంచుటయే గాక రెండురాజ్యములపైఁ బ్రభుత్వముఁ జేయఁగలుగుదుమనియు, వారుభయశత్రువులగు రజపుత్రులతో నిఁక వైర ముండదనియు, శుభకార్యమంతయు హిందూమతాచారములప్రకారమే జరిగించునట్లాజ్ఞాపించెను. వివిధదేశములనుండి పండితులు, బ్రాహ్మణులు, సామంతాదు లాహ్వానింపఁబడి సుస్వాగతము నందిరి.

తుదకు పెండ్లిముహూర్తసమయ మయ్యెను. పాదుషాయున్ను, లాలాయున్ను నౌకరిప్రక్కనొక రాసీనులైరి. అహమ్మదుషా లాలాచే పంపఁబడిన విలువగలదుస్తుల ధరించి యుండెను. అంతకంటె విలువగలదుస్తులను లాలా ధరించి యుండెను. యథావిధిగ పరిణయమహోత్సవమయ్యెను. వారిద్దరు దంపతులైరి. హిందూమతాచారముగ ముహూర్తమైన పిదప తముఁజూడవచ్చినవారికి దర్శన మొసంగుటకుగాను లాలా పాదుషాచేతిం బట్టుకొని పటాండాలోనికిఁ దీసికొని

వచ్చెను. తమ ప్రభుదంపతులను గాంచుటతోడనే చూచుట కు వచ్చిన ప్రజలు జయఘోష మొనర్చిరి. ఆదంపతులును వారికుచితరీతి సగౌరవముగ సమాధాన మొసంగి సంతోష పెట్టిరి. అట్లు జరుగుచుండఁగనే, యచ్చటి ప్రజలందఱును షాదషాధరించినదుస్తులనుండి వెల్వడుచున్న యగ్నిజ్వాలలం గాంచి యాశ్చర్యచకితులైరి. కాని యచ్చోట సూర్యరశ్మి బాగుగా తగులుచుండుటచే వారఁడు ధరించినదుస్తులయం దు చెక్కఁబడినరత్నములు ప్రకాశించుచున్న వేమో యని భ్రమపడిరి. కాని సూర్యకిరణముల వేడి విషపూరితములగునా దుస్తులపైఁ బడగానే యగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లెను. అహమ్మ దుషా యుద్ధభూమియందు ధైర్యవంతుఁడే. కాని మృత్యుదే వతయెదుట సందిటితో సమానుఁడే. అగ్నిజ్వాలల నార్పు కొనుట కాతఁడు సర్వవిధములఁ బెనఁగులాడెను. కాని ప్ర యోజనములేకపోవుటయే గాక రెప్పపాటులో వాతనికి మా ఱుగ నచ్చోట భస్మరేణువులుమాత్రము మిగిలియుండెను.

షాదుషా యనుభవించినమరణవేదన నంతయు లాలా కన్నులారఁ గాంచి సంతసించి తనతండ్రియొక్కయు సోదరుని యొక్కయు, తనవంశము యొక్కయు వినాశనమునకు కారకుఁడైనయాదుర్మార్గునికి సంపూర్ణమగుపరాభవముఁ జే యఁగలిగి ఋణవిముక్తురాలనైతిఁగదా యనుసంతృప్తిఁజెందిన దై కొక్కెరయున్న రజతసరోవరమునందు లేటాలునఁ బడి మరణించి వీరస్వర్గముఁగాంచి కీర్తికాంతయయ్యెను.

# జులేకా.

పదినేనువందలయిఱువదియాఱవసంవత్సరము జూలై మాసమునం దొకనాఁటి ప్రాతఃకాలమున ఆఫ్ఘనిస్థానదరిదర మందలి 'హాజరత్' అనునొకజాగీరునకుఁ జెందినరాజ సౌధమునకుఁ బోవుబాటగుండ జహాగీరుదారునిసోదరుఁడగు ముకరబ్ ఖాను మరియిద్దఱాశ్వికులతోఁ బోవుచుండెను. దుర్గము ప్రవేశించుకొలఁదియు నాప్రదేశము జనసంచార శూన్యమైనట్లుగా వారికి గోచరించుచుండెను. కాని దుర్గ ద్వారము సమీపించినతోడనే యందలి నిజస్థితి వారికిఁ గానన య్యెను. దుర్గరాజద్వారము విఱుగఁగొట్టఁబడి పాడుపడి యుండెను.

అదిగాంచి ముకరబ్ ఖానుఁ డదరిపడి క్షణమాత్రమున యశ్వము నవరోహించి చేతఁ గత్తిధరించి లోనికిఁ బరుగెత్తెను. పోరాడుటకు లోన నెవ్వరు శత్రువులు? శత్రువులేల! మనుష్యులే లేరు అంతయు సర్వశూన్యముగఁ గన్పట్టెను. ఎచ్చోటఁ జూచినను రక్తములోఁ బొరలుచుండినమృతకళేబరములును, విలువగల సామగ్రియంతయు పాడుచేయఁబడి చిందరవందరగా నంతటను వెదజల్లఁబడియుండుటయు నాతఁడు గాంచెను. వేఱొకగదియందు రాజబంధువులయొక్కయు, విశ్వాసపాత్రులయొక్కయు, ఆప్రక్కనే తనసోద

ఘని భార్యయొక్కయు, ముద్దుబిడ్డయొక్కయు శవముల నాతఁ
డు గాంచెను గాని యామెచేతియందలి బాకుఁ గాంచి యా
మెయే స్వమానసంరక్షణార్థమై యాత్మహత్యఁ గావించికొని
యుండునని యాతఁ డూహించెను. ఆమె ధరించియుండిన వెల
లేనినగలన్నియు మాత్రము బలాత్కారముగఁ దోంపుకొని
నట్లు స్పష్టమగుచుండెను. ఇదంతయుఁ గాంచి పాపము ఖా
నుఁడు నిశ్చేష్టుఁడై పోయెనన నాశ్చర్యమేమి? చివర కచ్చో
టఁ జరిగినకథనంతయుఁ జెప్పుట కుపిరితోనున్న జీవి యొక
డైనను నాతని కచ్చోటఁ గాన్పింపలేదు.

చైతన్యరహితుఁడై ముకరబ్ ఖానుఁ డటునిటు పరికిం
చి చూచుచుండఁగాఁ జనశాలమునుండి రాజకుటుంబమును
కనిపెట్టుకొనియున్నటువంటియు, చేతియందు వ్రేళ్ళు నఱకఁ
బడి యచ్చోట జరిగినకథ వినిపించుటకుమాత్రమే మేమాయను
చున్నట్లు కొనయూపిరితో నిలువు కష్టమైచికొని మూల్గుచు
కనుసన్నలతో తన్ను పిలుచుచున్నట్టియు నొకముసలి 'ముల్లా'
(మహమ్మదీయమతగురువు) నాతఁడు గాంచెను. ఆతని సమీ
పించినతోడనే ఖానునితో నాముల్లా యీక్రిందివిధముగ జరి
గినకథనంతను వినిపించెను. "మీసోదరుఁడు మనకున్నసర్వ
సేనాసమేతుఁడై పరిసరప్రాంతమందలి యొకవైరితోఁ బో
రాడఁబోయెను. విజయలక్ష్మి వైరినే వరించుటఁ జేసి మనసేన
యంతయుఁ దమప్రభువుతోసహా మడియుటయు తటస్థించెను.

ఈవర్తమానము దుర్గములోఁ దెలసి కలవరపడుచుండునంత లోననే సమీపపర్వతములనుండి 'మాన్సూర'ను దొంగల నాయకుఁడు తనదండుతో దుర్గముఁ బ్రవేశించి, దుర్గమంతయుఁ బూర్తిగాఁ దోచికొని దోపిడిసంతయు తనకొండలలోనికిఁ దీసికొని పోయెను. కోటరక్షించుటకు దిగవిడచిన కొలఁదిసైనికులునెంతపోరాడినను దొంగలసంఖ్య యెక్కువగుటఁ జేసి సర్వనాశనమైనది. సర్వప్రయత్నములు చేసియుండినను 'హజరత్ మణిని'మాత్రము వారు పట్టుకొని పోఁజాలకపోయిరి. మీసోదరునిసతి దొంగలు నన్ను హింసించకేమోయని తనయంత్యదశలో తలంచి యద్దానిని నా వశముఁ జేసెను. నన్నుఁజంపలేదు. కాని ఆదుర్మార్గులు నన్ను పూర్తిగ బాధపెట్టియుండిరి. దానిని నీకొఱకై జాగ్రతపెట్టి నాయంత్యదశయందు నీకొఱకై యెదురుతెన్నులఁ జూచుచుంటిని. నీవే యీకుటుంబమునకు జీవమగు నద్దానినిమాత్రము బహుజాగ్రత్తగ నుంచుకొనుము. నేను నాజీవితమంతయు మీకుటుంబసేవయందే ధారబోసితిని. ఇపుడు నాప్రాణములఁగూడ మీకుటుంబమునకే యర్పించుచున్నాను. కావున దీనిఁ దీసికొని నీప్రాణములతో సమముగాఁ జూచికొని జాగ్రతపెట్టుకొను"మని "యాహజరత్ మణిని" ముకరబ్ ఖానుని వశముచేసి విశ్వాసపాత్రుఁడగు నామసలిముల్లా తన ప్రాణములఁ బాసెను. అద్దానిని ఖానుఁడు తననడుమునందలి నటకాయందు జాగ్రత్తపఱచి, దుర్గమువెలుపలకు వచ్చెను.

బయటవిడచినయార్గురాశ్వికులలో నొకఁడు ఖాను
నికి కాన్పింపకుండ యాతని ననుసరించి లోనికిఁ బోయి య
చ్చోటఁ జరిగినసంగతినంతయు నాద్యంతము విని, మణిని
ఖానుఁడు భద్రపరచినస్థలముఁగూడ కనిపట్టెను. ఖానుఁడు
బయటకువచ్చి మిగిలినయయిదుగురాశ్వికులతో మాటలా
డుచున్నసమయమున లోనికిఁ బోయిన యా యాఱవయాశ్వి
కుఁడు బయటకు వచ్చి తనగుఱ్ఱమునెక్కి క్షణమాత్రములో
తనగుఱ్ఱమును కొండలముఖముగాఁ బర్వెత్తించుకొనిపోయె
ను. ఇదియంతయుఁ గాంచి ఖానుఁ డచ్చటనున్నవారల, స
మరమాసన్నమగుచో సమరమునకో, పలాయనమునకో
సిద్ధముగ నుండున ట్లాజ్ఞాపించెను.

పలాయితుఁడైన యాతఁడు "హాజరత్ మణి" ముక
రస్ ఖానునివశ మగుటఁగాంచి, యద్దానివలన తాను చాల
ద్రవ్యమును సంపాదించుటయో, లేక దానిని తాను వశముఁజే
సికొనుటయో చేయవలయునని తలంచి, హాజరత్ మార్గమును
దోచుకొనినదొంగలనాయకునిసహాయమువలన తనకోర్కె
యచిరంగ సఫలమగునని యోచించి దుష్టబుద్ధియై తనగుఱ్ఱ
మును దొంగలనాయకుఁడుండుకొండలముఖముగా మఱ
లించుకొని పోయెను. కొంతదూర మేగునప్పటికే యాతఁడా
దొంగలదండులోఁ గొందఱిని కలసికొని వారిచేత మనవా
యకునియొద్దకుఁ గొనిపోఁబడెను. గోల్లావంటిముఖమును

నల్లనిగడ్డమును గలిగి అష్ఘనుదేశస్థుడైన యాదొంగలనాయకుఁడు మిగిలినతనవారి నందఱకు దూరముగాఁ బొమ్మని యానూతనపురుషుని రాకకుఁ గారణ మడిగెను. ఆనర్మాష్ఠుఁడు, హాజరత్ మణి యెచ్చోటనున్నదో తా నెఱుఁగుదుననియు, దొంగలను కొందఱను సహాయమంపినచో మణిని తాను సంపాదించుకొని, యద్దానికిగాను దొంగలదండునకు కొంతధనము నిత్తుననియుఁ జెప్పెను కాని యద్దాని కాదొంగలనాయకుఁ డనుమతింపలేదు. ఆమణి యెచ్చోటనున్నదో చెప్పినయెడల ముందుగా నేఁబదినవరనుల నిచ్చుటకును, మణి దొంగిలవాయకునివశ మైనపిదప మఱి నూఱునవరనుల నిచ్చుటకును నిశ్చయించుకొని, యేఁబదినవరనులను దొంగలనాయకుఁ డానూతనపురుషున కిచ్చెను. అంత నాదుర్మార్గుఁడు మణి మురకింద్ ఖానునస్వాధీనములో నున్నట్లును, దాని వానిఁడెచ్చోట దాచియుంచినసంగతియు వానని కెఱింగించెను.

అట్లు చెప్పుటెటడవుగా నాయకుఁ డాక్రొత్తయాతనిని "నీవు నీప్రభునెడలఁ జూపిన స్వామిద్రోహమునకు ఫలమనుభవించు" మని యొక్కవ్రేటున యాతనిఁ దెగనఱికి వానియొద్దనున్న యేఁబదినవరనులను మఱల తీసికొని తన దండుతో నశ్వారోహుఁడై హాజరత్ దుర్గమువై పతిరయమున బోయెను. గతించిన వారిశవముల కంత్యసంస్కారములఁ

చేయు ప్రయత్నములో నున్న ముకరబ్ ఖానుఁడు కొండల లోనుండి తనవైపునకు వచ్చుచున్న ముప్పదిమంది యాశ్వికులఁజూచి, జఱిగినకథ నూహించుకొని తత్క్షణము మిగిలిన యయిదుగురుబంట్లతో నశ్వారూఢుఁడై శత్రువులు దూరమున నుండఁగనే పలాయితుఁడాయెను.

అవట్టికి కాబూలులో యుద్ధము నల్పుచున్న "బాబరుని" ఆతఁసైన్యమును కలసికొను నుద్దేశముతో ఖానుఁడును అనుచరులును కాబూలుముఖముగాఁ దనుగుఱ్ఱములఁ దఱుముచుండిరి. దొంగలనాయకుఁడు తనదండుతో వారిఁదఱుము చుండెను. ప్రాణములకుఁ దెగించి వారట్లు రాళ్ళనక, రప్పలనక, మెట్టలనక, కొండలనక నొకరివెనుక నొకరు తమగుఱ్ఱములఁ దఱుముచుండిరి. అట్లుపోవుపోవు వారొక మైదానములోనికి వచ్చిరి. కాని ముకరబ్ ఖానునిగుఱ్ఱముతో మిగిలిన యయిదుగురిగుఱ్ఱములు పోఁజాలకుండెను. దొంగలు సమీపించుచున్నపుడు ఖానుఁడు తనయనుచరులను తన్నువిడచి వేఱొకమార్గమునకుఁ బొమ్మని యాజ్ఞాపింపఁగా వారు తమయేలికను విడచి వేఱొకమార్గమునకు తమగుఱ్ఱముల మఱలించుకొని పోయిరి. కాని దొంగలు తన్నే వెన్నాడుచుండుటఁ గాంచి ఖానుఁడు తనచేతియందలి రికాబులను వదలివేయఁగా మంచిజాతిదైనయా యాశ్వరాజము వాయువేగమున పరుగిడి పోవుచుండెను. మాన్నా

రుగుఱ్ఱము కూడ మంచిజాతిదే యగుటఁజేసి యంతదగ్గరగా పోలేకపోయినను ఖానునిగుఱ్ఱముతో సమానముగాఁ బరుగిడుచుండెను. అటువంటి సమయమున దినరాజస్తంగతుఁడగుటయు, దొంగలగుఱ్ఱము లొకదానివెనుక నొకటి క్రమముగా దిగజారుటయు తటస్థించెను. దొంగలనాయకుఁ డిది యంతయుఁ గాంచియు ధైర్యమును వీడక ఖానునొక్కని నెట్లైన దునుమవచ్చు ననుతలంపుతో నొక్కఁడు వారిని వెన్నాడించుచుండెను.

అట్లు కొంతదూర మేగినపిదప ఖానుఁడు వెనుదిరిగి చూచి తనొక్కఁడే తఱుముచున్నాఁడని తెలిసికొని యత్యుగ్రుఁడై బాణమును సంధించి, గుఱ్ఱమును వెనుకకు మఱలించి శత్రునిపై గుఱిపెట్టి కొట్టెను. ఇదంతయుఁ గాంచుచుండిన దొంగలనాయకుఁ డా బాణపుగుఱి తప్పుటకుగాను తనమెడను గుఱ్ఱపుమెడక్రిందికి వంచెను. అంత నా బాణమతనికిఁ దగులుటకు మాఱుగా గుఱ్ఱమునకు తగులఁగా నా యశ్వము రోదనసేయుచు నేలఁగూలెను. తానుగూడ దెబ్బతిన్నవానివలె నటించి యాదొంగలనాయకుఁడు గుఱ్ఱముమీఁదనుండి క్రిందకు దొరలి చైతన్యరహితుఁడైనట్లుగా నేలపైఁబడిపోయెను.

విరోధి హతుఁడైనా డనుతలంపుతో ఖానుఁడు తన గుఱ్ఱమును దిగి పడియున్నయాతనిదగ్గరకువచ్చి వంగి యా

తని పరీక్షించుచుండఁగా నాదొంగలనాయకుఁడు డొక్కయు
దాటున ఖానుని మొలకట్టిని గట్టిగాఁ బట్టుకొనెను. ఆచో
టనే కలహమునకు మూలకారణమైనమణియుఁ దాఁచఁబడి
యుండెను. అంత నిర్వురకు పోరు ప్రారంభమగుటయు, మొదట
ఉక్కునోటిగొనిమొలుకవలె దొంగలనాయకునకు ఖానుఁడు
లొంగిపోవుటయు తటస్థించెను. కాని యంతలోనే సర్దుకొని
ఖానుఁ డాతనితలపైని, ఛాతిపైని బలమైనదెబ్బలు చాలకొ
ట్టెను. ఇట్లు చాలవఱకు పెనఁగులాడి చివరకు ఖానునిచేఁ
బెద్దదెబ్బ తిని పెద్దగా నఱచుచు నాదుర్మార్గుఁడు నేలఁబడి
దొఱలుచు మృతినొందెను. ఖానుఁడుమాత్రము మిక్కిలిగన
లసిపోయెను. అతఁడు నేలపై తనచెవినాని యెవ్వరైన వచ్చుడి
నడి యున్నదేమో యని చూచి యెవ్వరిరాకయు లేకపోవుటఁ
జేసి నాఁటిరాత్రి కచ్చోటనే విమరించి శ్రమఁబాపుకొననెంచి
గుఱ్ఱము నొకచెట్టుకొమ్మకుఁ గట్టి సమీపములోనేయున్న
యొకపెద్దగోడ నానుకొని పరుండి సుఖముగా నిద్రాపర
వశుఁడయ్యెను.

మఱునాఁడరుణోదయమున నాతోటయందలి శకుం
తసంతానములసంగీతరవములకును, ఉదయభానుని లేత
కిరణములు ముఖముపైఁ బ్రసరించుటఁ జేసియు ఖానుఁడు
కన్నులు విప్పిచూచునరికి నేత్రానందకరమగుదృశ్య మగపడి
యెను. ఆనంస్థానపుమర్గమున కంటిపెట్టుకొనియున్న సుంద

రవనమందు తానున్న ట్లాతఁడు తెలిసికొనెను. అచ్చట విరియఁ బూచినచెట్లసముదాయమును, చెట్లపైవచ్చు పరిమళయుతమైన చల్లనివాయుప్రసారములును, యందునివశించు శకుంతసంతానముల సుఖసంగీతరవములును, మన కథానాయకునకు హృదయాహ్లాదకరములును, నేత్రానందకరములు నై యుండెను. సుందరమైన యా "ఘాల్ మాన్" దుర్గము, అఫ్ఘనిస్థానమందలి సుప్రసిద్ధములలో నొకటై, 'డాస్టు మహమ్మద'ను నాతని పరిపాలనయం దుండెను.

అట్టిసమయముననే దుర్గాధిపతియేకపుత్రికారత్నమగు 'జులేకా' యిర్వురుచెలికత్తియలు వెంటరా దుర్గములో విహారము సల్పుచు, దుర్గప్రాకారము సమీపించి, ప్రతిదినము దుర్గములోపలి ప్రదేశమునే గాని వెలుపలిప్రపంచముఁగుఱించి యింతకంతయు నెఱుంగనిదగుటఁజేసి, దుర్గమువెలుపలి ప్రపంచము నొకసారి చూచుటకై తోఁటలోనికిఁ బోవుద్వారమును తెఱవుమని చెలికత్తియ కాజ్ఞాపించెను. చెలికత్తె రాజన శ సంగతి తెలిసినచో నాతఁ డాగ్రహించునని యనుచు నాద్వారముఁ దెఱచెను. జులేకా యాద్వారబంధముపై నిలుచుండి వెలుపలిప్రపంచముయొక్క చిత్రమును దిలకించుచుండెను. అప్పట్టున నామెఁ గాంచినవారికి భూలోకమున యవతరించినరతీదేవియా యనుసంశయము గలుగక మానదు. ముకరబ్ ఖానుఁ డట్టిచల్లనివేళ పరుండినస్థల

నమునుండి లేచి కూర్చుండునంత నాదివ్యసుందరరూప మాతని
కన్నులఁబడెను. జులేకా యాతనిఁ గాంచినతోడనే ముఖముపై
కి బురఖాను లాగికొనెను. ఖానుఁడు మాత్రము వక్షస్థలము
నఁ జేయిఁ జేర్చి లేచి గౌరవపురస్సరముగ వంగి "భగవంతుఁ
డు మీకు శాంతి నొసంగుఁగాక" యనెను. దానికి బదులు
గా నామెయు "దేవునిదయయు, తన్మూలమున శాంతియు
మీకు కలుగుఁగాక" యను మాటలు సహజమగు బిడియ
ముతోఁ గూడిన గౌరవముతో మెల్లగ నని లోనికిఁబోయె
ను. అటులామె మాయమగుటతోడనే ఖానునకు భానుని
కాంతి తగ్గినట్లుగను, శకుంతసంతానముల సంగీతరవములు
కర్ణకఠోరములుగను దోఁచెను. తాను రెండుక్షణములు మా
త్రమే చూచినను ఆబాలికయందు పూర్తిగ మోహవివశుఁ
డై పోయెను గాని యంతలోనె, ధనవంతుఁడైన యాఝూల్
మాన్ దుర్గాధీశ్వరుని పుత్రిక, దేశసంచారియగు తనకెట్లు
లభించునని నిరాశఁ జెందెను. అట్టిసమయమున తనవంశమున
కు మూలాధారమైనట్టియు, నపుడు తనయొద్దనున్నట్టియు హా
జరత్ మణిసంగతి జ్ఞప్తికి వచ్చి, తన ప్రయత్నమునందది యు
పయోగించునేమో యను నాశతో దుర్గద్వారమునొద్దకుఁ
బోయెను.

ఝూల్ మాన్ దుర్గాధిపతియగు హస్టు మహమ్మదు
ఖానుకుటుంబమునకు పూర్వమిత్రుఁడే యగుటం జేసి, ఖానుని

కష్టములకు సానుభూతిఁ జెల్పుటయేగాక, వెలలేనిమణిని గ
ల్గియున్నయాతనికి తనకూఁతునిచ్చి వివాహముసేయుటకును
సమ్మతించెను. కొలఁదిరోజులలో ముకరబ్ ఖాను జాలేకాలకు
వివాహ మతివైభవముగా జరిగెను. వివాహము జరిగిన కొ
లఁదిరోజులలోనే ఖానుఁడు కొంతసైన్యముతో హిందూస్థాన
ములో పోరుసల్పుచున్న బాబరుసైన్యములఁ గలిసికొనుటకై
వెడలిపోయెను. హాజరత్ మణిని దీసికొన్నను దానికిబదులుగా
జాస్తుమహమ్మదు తనయల్లునికి చాలద్రవ్యము నిచ్చెను. కొలఁ
దిరోజులలోనే ఖానుఁడు యుద్ధభూమినుండి జయలక్ష్మితోఁ దిరి
గివచ్చి శత్రులనోడించి తనరాజ్యమునేగాక శత్రురాజ్యమును
గూడ జయించి సుఖముగా బరిపాలించుచుండెను. హాజరత్ మ
ణికన్న శతసహస్రముల విలువయగు నవలావణ్యరూపవిలాసిని
యగుభార్యయనుమణి తనకు లభించుటంజేసి "హాజరత్ మణి"
తనచేతులనుండి పోయిన దనువిచార మావంతయుఁ బొందక
వాతఁడు సంతోషసాగరమున నోలలాడుచుండెను.

# ద్వంద్వయుద్ధము.



సహార్ ఘర్ పట్టణము గంగోపనదులలో నొకటగు ఛాంబల్ నదియొడ్డున నిర్మింపఁబడి, యప్పటిగొప్పపట్టణముల లో నొక్కటియై వెలయుచుండెడిది. తత్పురాధీశ్వరునికోట యానదిగట్టుననే నిర్మింపఁబడిన దగుటచే రెండువైపుల నది యు, మిగత రెండువైపులఁ గొండలును పెట్టనిగోడలై తన రాగుచుండెడిని. ఆకోటవిశేష మేమనఁగా, శత్రువులు కోట లోఁ బ్రవేశించుట కేమాత్రమును వీలుకాకుండఁ గోటలో నింకొకకోట నిర్మింపఁబడియెను. వెలుపలిగోడ దాఁటినపిదప లోపలిగోడయు దానినంటిపెట్టుకొనియే జనానానివసించెడి భాగములును కలవు. ఎత్తైనప్రదేశమందు నిర్మింపఁబడుటచే జనానాలోనిస్త్రీలు సౌధములపై కెక్కి నదీతోయముల యొక్కయు, పరిసరములందలి పర్వతములయొక్కయుఁ బ్ర కృతిసౌందర్యమందలిమాధుర్యమును గ్రోలుభాగ్యము కల వారగుచుండిరి.

నాల్గునందలసంవత్సరములకుఁ బూర్వము జ్యేష్ఠమాస మున నొకనాఁటిరాత్రినాల్గవజామున, కారుచీఁకటులు క్రమ్ము కొనియున్నసమయమున సహార్ ఘర్ దుర్గాధీశ్వరునికొమరిత తాను శయనించినగదిలోనికిటికీగుండ క్రిందినదిలోని యిసుక తిన్నెలఁజూచుట తటస్థించెను. ఆసమయమున నదిలోఁ గోట

గోడకుదగ్గరగ దీపపువెలుతురుంగాంచి యాశ్చర్యనిమగ్న మానసయై నిర్లక్ష్యభావముతో నద్దానినిగుఱించి యేమియుఁ దెలిసికొనకుండ మరలఁ దనశయ్యంజేరి నిదురించెను. ఆదీప పువెలుతురునకుఁగలకారణముంగూర్చి యామె వితర్కించి యుండినను, లేక తాను గాంచినదానినిగూర్చి తనతండ్రికి తెలియఁజేసియుండినను, ఆసన్నవిపత్తునుండి తన్నుఁదాను సం రక్షించుకొనియుండుటయేకాక తనతండ్రిని కోటనుగూడ రక్షించియుండెడిది. ఎందువల్లననఁగా నాదీపము తనతండ్రి కోటను ముట్టడింపవచ్చి దుర్గప్రవేశమునకై గోడల నెగఁ బ్రాకుటకై ప్రయత్నించుచున్న శత్రుసేనాసమూహములో నిది; ఆసేనాసమూహము మోహధనమదోన్మత్తులగు మహ మ్మదీయులది. సేనానాయకుండైన ఫతేజంగు, అపూర్వలావ ణ్యవిలాసినియగు దుర్గాధీశ్వరునికొమరితకొఱకును, తక్కుం గలవారలు కోటలోఁగల వెలలేనిధనవస్తుసముదాయములఁ గొల్లగొట్టి స్వాధీనముచేసికొనుటకొఱకును నుద్దేశించి వా రాకోటపై దండెత్తివచ్చిరి.

దుర్గాధిపునికొమరితయగు కమలావతి సూపరేఖావిలా ససంపద రాజపుత్రస్థానమంతయు ధ్వనించుచుండ, ఒక మహ మ్మదీయుని మోహవివశునిఁ జేసినదన నందాశ్చర్య మేమున్న ది? తానే యానారీమణిని సంపాదించుకొనఁగల్గినచో మిగి లినధనసంపత్తి నంతను తనయనుచరుల కిచ్చివేయ నిశ్చయిం చుకొనెను.

ఆసేనాసమూహము పెక్కుశ్రమలకోర్చి శత్రుల కెఱుకపడకుండ దుర్గప్రాకారముల సమీపించి నదిలోనియిసుకతిన్నెలపై విడిసి శ్రమంబాపుకొనుచుండెను. దారిలో వారికి గాన్పించినకొలఁదిహిందువులను వా రాస్థలమందే చంపివేసి యుండనిచో వారిరాక యాసరికి దుర్గములోనివారి కెఱుకపడియే యుండెడిది. శ్రమ బాపుకొనుచుఁ దమవెంటఁదెచ్చుకొనిన యాహారపదార్థములను పచనముచేసికొని భుజించి, ముందు తాము చేయవలసియున్న దుర్ఘటకార్యముఁగూర్చి తలపోసికొనుచు దుర్గప్రవేశమునకు వెర వాలోచించుచుండిరి. దుర్భేద్యము లగుపర్వతశ్రేణులు పెట్టనిప్రాకారములై యిలసిల్లుచున్న సహార్ఘుర్ దుర్గప్రవేశ మంతసులభమైన కార్యము కాదు. నదియడుగుభాగమునుండి పైకిఁ జూచుచున్నకొలఁది దుర్గప్రవేశమునందలికష్టము వారికి గోచరించుచు నిరుత్సాహులఁ జేయుచుండెను. అట్టిచల్లనివేళ దుర్గముయొక్క ఘనత కచ్చెరువందుచు యోచించుచున్నయాసేనాసమూహమందలి గుసగుసలుతప్ప మఱియొక సడిగాని యచ్చోట వినవచ్చుట లేదు.

వారు శ్రమనపనయించుకొనుటకైన నెంతో గడువు లేదు. ప్రతినిమిషమును దుర్గములోనివారు తమ్మెక్కడ గుర్తించి తమపైఁబడి తమ్మునాశనమొనరించి తామనుభవించినశ్రమలనన్నిటిని నిష్ఫలమొనరింతురోయను భయము వారిని

ప్రతిక్షణమును వేచించుచునే యుండెను. ఆక్షణమున సేచమూపతియగు ఫతేజంగు కార్యరంగమునకు దిగునట్లు సంజ్ఞ చేయగనే సేనయంతయు నెత్తైననిచ్చెనలు ప్రాకారమునకుఁ జేర్చి పైకెగఁబ్రాకుప్రయత్నములు సల్పుచుండిరి. నోటమాటగాని మఱియే చిన్నశబ్దముగాని రానీయక ఆనాఁడు కటికచీఁకటిగా నుండుటవలన నదృష్టవంతుఁడగు ఫతేజంగు తనసైనికులతో, దుర్గములోనివారు తమ్ము గుర్తింపకపూర్వమే యాప్రాకారపు పైభాగమునకుఁ జేరుకొనఁగలైను. ఫతేజంగు క్షణములో లోపలిభాగమునకు దుమికి అచ్చట కాపలాయున్న కొలది మందికాపలావారిని కడతేర్చునంతలోఁ ఒక్కఁగలయను చరులందఱును వచ్చి యీతనిగలసికొనిరి. అంత వారు దారిలోని హిందూసైనికులనందఱిని బరిమార్చుచు దుర్గముసమీపించిరి.

ఈలోపల విపత్తును సూచించుతిత్తూరా యూఁదబడుటచే నిద్రాశక్తికిలోనై మైమఱచి నిద్రించుచున్నవారందఱు మేల్కొంచి యాసన్నవిపత్తు నెఱింగినవారై యుద్ధసన్నద్ధులైరి. రసపుత్రులు నిద్రాసక్తులై యుండుటచేఁ గొందఱు కవచధారులై, మఱికొందఱు రిక్తహస్తులై తత్క్షణము మాత్రమే యుద్ధభూమికి సంసిద్ధులైరి. మహమ్మదీయులుమాత్రము మందఱును గవచధారులై యుద్ధమునకు సర్వసిద్ధముగా నుండిరి; అందువలనఁ దమసంఖ్య తక్కువైనను మహమ్మదీయులు గుం

పులుగుంపులుగావచ్చిన రసపుత్రుల నురుమాడుచు వెనుదరు ముచుఁగోటమధ్యభాగమునకుఁ జేరుకొనిరి. రసపుత్రులు చెద రఁగొట్టఁబడినవారై దర్బారుగదులలోను దేవాలయములం దును దాఁగుకొనవలసివచ్చెను. ఈలోపున సర్వాంగకవచ ధారులైనరాజపుత్రయోధులు కొంద ఱచ్చోటికివచ్చి పరిస్థి తులుగ్రహించి వెంటనే జనానాలోనికిఁబోవు సన్ననిమార్గ మును శత్రువులుప్రవేశింపవీలులేకుండ నరికట్టిరి.

బహుసుందరముగా నద్దములచే నమర్పఁబడి ప్రతిన స్తువు నన్నివైపులఁ బ్రతిబింబింపఁజేయుచు జూపరుల కచ్చె రువుకలుగఁజేయు నాదర్బారుగదిఁబ్రవేశించి దానిసొంపుతీరుఁ గాంచి మహమ్మదీయు లచ్చెరువందకపోలేదు. గదిలోఁబ్రవే శించినయనతికాలములోనే యచ్చటిరసపుత్రులనందఱి నురు మాడి పాలగచ్చుతో నమర్పఁబడిన యచ్చోటంతయు రస పుత్రవీరరక్తముచే నిండింపఁజేసి మహమ్మదీయు లాస్థలము నెంతయు భయానకముగా నొనర్చివైచిరి. వేఱొకతెగ మహమ్మదీయసైనికులు రసపుత్రుల కిష్టదైవమగు శ్రీకృష్ణ పరమాత్మయొక్కయు రుక్మిణీదేవియొక్కయు విగ్రహము లున్నదేవాలయముం బ్రవేశించి మొదట పూజారులనంద ఱిని సంహరించి యచ్చోటనున్నవిగ్రహములనన్నింటిని ముక్క ముక్కలుగా విఱుఁగగొట్టివేసిరి. అట్లు మహమ్మదీయులు తమతమ వర్ణద్వేషములు తీర్చుకొని తరతరములనుండి యాదే

వున కర్పింపఁబడిన రజత సువర్ణరత్నరాసుల నన్నింటిని తమ వశముచేసికొనిరి. మహమ్మదీయుల కీదుర్గముపై దండెత్తునుద్దేశ్యముకలుగుటకు మొదటికారణ మీవిగ్రహములయందలి వెలలేని సువర్ణమణిమాణిక్యముల నపహరించుట; రెండవది: నవరూపలావణ్యరాశియగు కమలావతీకన్యామణి నపహరించుటను.

ఇంకొకగుంపుమహమ్మదీయసైనికులు అంతఃపురములో జొరఁబడుటకుఁ జాలప్రయత్నములఁజేసిరి. కాని, కృతార్థులుకాలేదు. ఆప్రదేశమును, యోధాగ్రేసరుఁడగు నొకరసపుత్రవీరుఁడు కొంతమందిసైనికులతోఁ గాచికొని శత్రుప్రు లందు చొరుట కేమాత్రము నవకాశ మీయలేదు. సాహసికుఁడగు నాతఁడు మ్లేచ్ఛసైనికులనందఱిని గొన్నిమెట్లవఱకుఁ బైకిరానిచ్చి హఠాత్తుగ వారిపైఁబడి కొందఱిని హతమార్చి తక్కుంగలవారిని వెనుకకుఁ దఱిమివేసెను. ఈలోపున ఫతేజంగు తనసైనికులనందఱిని దుర్గమధ్యమునకుఁ జేరుకొనునట్లుగా నాజ్ఞాపించుటచే వారందఱు నచ్చోటఁ జేరుకొనిరి. అప్పటివఱకు మహమ్మదీయు లంతఃపురమునఁ బ్రవేశింపఁగలుగుప్రయత్నమునందుతప్ప తదితరప్రయత్నములన్నిటియందును కృతకృత్యులైరి. తీసికొనిపోవుటకు సులభసాధ్యమైన దోపిడి వలసినంతదొరకెను. ఇఁక వా రాదోపిడితో వెనుకకు మరలుటయే శ్రేయస్కరము కాని ఫతేజంగుమో

హించిన రసపుత్రవారనారీమణి, నవరూపలావణ్యవిలాసిని, దుర్గాధిపునికొమరిత యాతనికంటనైనఁబడక జనానాయందే సురక్షితయై యుండుటయు, నచ్చోటికి వారెంతమాత్రమును బ్రవేశించుటకు వీలులేకుండ ధైర్యశాలురగుయోధులు సంరక్షించుచుండుటయు జరుగుటచే మహమ్మదీయు లితికర్తవ్యతామూఢులైరి. శత్రువులు తమ్ము సమీపింపకమును పే తమకుఁ జిక్కినవెలలేనిదోపిడితో వారు వెనుదిరిగిపోయి తమప్రాణములు కాపాడుకొనుటయా లేక తాను మోహించి నకాంతను సంపాదించుకొనుట కచ్చోటనే యుండుటా యను విషయమును ఘతేజంగు నిశ్చయింప వలసినవాఁడయ్యెను. ఘతేజంగు మంచియుక్తిపరుఁడైనవాఁడగుటం జేసి తనకోర్కె విడిచిపుచ్చి తనసైనికులప్రాణములను గాపాడునుద్దేశముతోఁ దా మెక్కివచ్చిననిచ్చెనల వెంటఁ గ్రిందికి దిగిపోవునట్లుగా వారల కాజ్ఞాపించెను. వెంటనే వారు ప్రాకారముకడకువచ్చి నదీగర్భమునుండి ప్రాకారములకుఁ దమచే వేయఁబడిననిచ్చెనలకొఱకుఁ జూచునరి కవి యచ్చటలేక నదిలోఁ బడియుండెను. మహమ్మదీయులు దుర్గములోఁ జక్కఁ బెట్టుచుండఁగాఁ గొందఱురాజపుత్రులు నిచ్చెనలయొద్దఁ గాపునిచినకొలఁది మందిమహమ్మదీయులను సంహరించి, లోనివారు బైటికిదిగుటకు నీలులేకుండ వానిని నదిలోఁ బారవైచిరి. వారు పాఱిపోవుమార్గ మీవిధముగా నరికట్టివేయఁబడుటచే వారు మరలఁ

దుర్గమునఁబ్రవేశించి దుర్గమును తమవశ మొనర్చుకొనుప్రయత్నములఁ జేయక తప్పినదికాదు కావున సమయమే తెంచుచోఁ దమవినాశనమునకుఁగూడ సంసిద్ధులగుటకు వారుస్థిరసంకల్పులైరి.

మహమ్మదీయులు దుర్గప్రాకారములదగ్గరకువచ్చి పట్టణములోఁ జూచుసరికిఁ బట్టణములోనివారెవరుం దమ్ము కోటలోనుండి తరిమివేయుటకై సంసిద్ధు లగుచుండుటయు, పెక్కుయోధులతోఁగూడినరసపుత్రసేనయొకటి దుర్గద్వారమునకు వెలుపల నుండుటయు గోచరించెను. కోటలో మాత్రము శత్రువు లంతఃపురమునఁ బ్రవేశించుటకు వీలులేకుండఁ గాపాడుచున్న కొలఁదిమందిరాజపుత్రులుతప్ప నెవ్వరును లేరు. ఆసమయమున మహమ్మదీయులు చెఱఁబడ్డవారును, చెఱఁబట్టువారునుకూడ నగుట తటస్థించినది. పైనుండినరసపుత్రసేనకోడి తాము చెఱఁబడుటయో లేక సాహసికవీరరత్నమును, స్ఫురద్రూపియు నగురసపుత్రవీరునితోఁగూడియున్నకొలఁది మందినిసంహరించి జనానాలోనివారిని జెఱఁబట్టుటయో తప్ప వారికి వేఱొకగత్యంతరము లేకపోయెను.

ఇరుతెగలవారును నాయుధపాణులై యుద్ధసన్నద్ధులై యొండొరు లొకరిపైనొకరు తలఁబడఁబోవుచున్న సమయమందు రాజునొద్దనుండి మహమ్మదీయులయొద్ద కొకరసపుత్రుఁడు రాయబారముతీసికొనివచ్చుటచేఁ బోరు ప్రారంభిం

పఁబడలేదు. మహమ్మదీయులారాయబారిని ఫతేజంగుకడకుఁ దీసికొనిపోయి యాతనిరాయబారపుసమాచారము నివేదింపుమనిరి. అంత నాతఁడు తనదుర్గపుఘనతనుగూర్చియు, రసపుత్రులవీరత్వముగూర్చియుఁ బెద్దగ నుపన్యాసమిచ్చి, తనప్రభువుశౌర్యమును, ఘనతను పొగడుచు ఏషరతులును లేకుండ మహమ్మదీయులు దుర్గమునువిడిచిపెట్టి పోవలయునని తెల్పెను.

ఫతేజంగు శౌర్యవంతుఁడు; ప్రతిభాశాలి; యుక్తిపరుఁడు; బలశాలి; బుద్ధిచాతుర్యములుగలిగినయువకుఁడు. కారణములేకుండ రాజపుత్రులు తమంతటతాము సంధిప్రయత్నములుసల్పుట కేదియోకారణముండకపోదని యాతఁడూహించెను. సంధికే రానియెడల రసపుత్రులు తమయాలుబిడ్డలు దుర్గములో మహమ్మదీయులదయాదాక్షిణ్యములకులోనైయున్నారనుసంగతిని గ్రహించియే యీరాయబారమంపినారనికూడ తురుష్కసేనాని గ్రహించియుండెను. రాణివాసమును కాపాడుచున్నయిరువదిమంది యోధులు నెంతటిపరాక్రమవంతులైనను నధికసంఖ్యగల మహమ్మదీయులతోఁ బోరిజయింపఁజాలరనియు నాతఁడెఱుంగును. ఈవిషయములన్నియు ఫతేజంగురాయబారి కెఱిఁగించి యీక్రిందిపద్ధతులకనుమతించినచో సంధి కుదురునని పల్కెను.

సంధికి షరతులుమూఁడు. అందుమొదటిది—

మహమ్మదీయుల నెట్టియడ్డంకులు లేకుండ వారుదోచుకొనిన దోపిడితో సాయుధపాణులైనమహమ్మదీయులను తమజెండా నెగురవేయుచు దుర్గమునువిడిచిపోనిచ్చుట; రెండవది- రాజపుత్రికయగు కమలావతిని ఫతేజంగునకు భార్యగా సమర్పించుట; మూఁడవది- ఫతేజంగుతో నొకరసపుత్రయోధుఁడు ద్వంద్వయుద్ధ మొనర్చుట; ఆద్వంద్వయుద్ధమున ఫతేజంగోడిపోవుట తటస్థించినచోఁ గమలావతిని ఫతేజంగున కీయనక్కఱలేదు. ఈషరతుల నెఱింగించి, యింకను మిక్కుటమగు మహమ్మదీయసేన తమసహాయార్థము వచ్చుచున్నదనియు, దానిసాహాయ్యమున దుర్గము సర్వవిధముల ధ్వంసమొనర్పఁబడుననియు నారాయబారి కెఱింగించి పంపివేసెను.

రాయబారి యీవిధమైనసమాచారములుతీసికొనివచ్చినంతనే యుద్ధాభిలాషులగురసపుత్రులు ద్వంద్వయుద్ధపు పద్ధతికి మిక్కిలిసంతసించిరి. ప్రతివ్యక్తియుఁ దాను ద్వంద్వయుద్ధమునకుఁ బోయి, తనశక్తియు, రసపుత్రవీరరక్తము యొక్క ఘనతయు, నహంకారముయొక్కప్రతిభయు వెల్లడిచేయవలయుననుకోర్కెతో నువ్విళ్ళూరుచుండిరి. కాని, కమలావతిని మహమ్మదీయున కీయవలయుననెడిషరతు వారికెంతయుఁ గష్టముగా నుండెను. రసపుత్రవీరనారీశిరోరత్నమగు కమలావతి నొకమహమ్మదీయున కిచ్చుటకంటె నాపెకొఱకు జనానాలోఁగలతక్కుంగలవారందఱు నశించుటయే వారికి

సంతోషకరముగా నుండెను. కమలావతినిచ్చుట యనుషరతు లేకుండఁజేయుట కెన్నియో రాయబారములు మరల ఫతేజంగుకడ కంపఁబడెను. ఎట్టకేలకు ద్వంద్వయుద్ధము నిశ్చయింపఁబడి యీక్రిందిషరతుల కిరుతెగలవారు నియ్యకొనిరి. ద్వంద్వయుద్ధములో ఫతేజంగుజయించినచో నాతఁడు తన సేనానివహముతో నెట్టినిర్బంధనలకును లోఁబడనక్కఱ లేకుండ దుర్గమునువిడిచి స్వేచ్ఛగాఁ బోవుటయేకాక తాము కొల్లగొట్టిన వెలలేనినగలునాణెములు మొదలగునవి తీసికొని పోవుటకును, అట్లుగాక రసపుత్రుఁడే జయించుటతటస్థించినచో మహమ్మదీయులు దోపిడిని, తమయాయుధములను విడిచిపెట్టి ప్రాణములతో బయటికిఁబోవుటయును నిశ్చయింపఁబడెను. గెలిచినయోధుఁడు ఓడినయోధునికవచాంగదాదులు బహుమానముగాఁ దీసికొనవచ్చు ననుషరతుకూడ నిశ్చయింపఁబడెను.

అట్లు ద్వంద్వయుద్ధపుషరతులు నిశ్చయింపఁబడినపిదప, షరతులు తమకంగీకారములే యని మహమ్మదీయులు పవిత్రమగు ఖురానుసాక్షిగను, హిందువులు గంగాజలములు సాక్షిగను ప్రమాణములుచేసికొనిరి. పిదప మహారాజు సేనానాయకులనందఱిని రావించి సభగావించి ద్వంద్వయుద్ధమున కెవ్వరినిపంపవలయుననెడివిషయము నాలోచించెను. అచ్చటి యోధులందఱును ఎవరికివారే నేనుపోదును, నేనుపోదునని

సిద్ధపడిరి. కాని, చివరకు, మహావిపత్సమయమున రాణివా సము నతికష్టముతోఁ గాపాడినరామసింగను రసపుత్రవీరసిం హామే యందులకుఁ దగినవాఁడని యందఱు నిశ్చయించిరి. రాజుకూడ నందుల కానందపూర్వకముగ ననుమతించెను. రామ్‌సింగు బలశాలియు, పొడవరియు, ధైర్యసాహసోపే తుఁడునగు యువకుఁడు. అంతవఱకును పెక్కుమహమ్మదీ యుల నెదుర్కొని అంతఃపురములోని కొంతమాత్రమును వారు ప్రవేశించుటకు వీలులేకుండ నరికట్టినధీశాలి. అతఁడే యిందులకుఁ దగినయోధుఁ డనుమాట నిశ్చయము.

ద్వంద్వయుద్ధముజరుగుటకుఁ గోటగుమ్మముముందొక పెద్దక్రీడారంగ మేర్పాటుచేయఁబడెను. ఒకప్రక్క మహమ్మ దీయులును వేఱొకప్రక్క హిందువులు నాసీనులై యుండిరి. వారికిఁ గొంచెముదూరముగా నమర్పఁబడిన పూర్వసింహాస నముపై వెలలేనిదుస్తులధరించి రా జాసీనుఁడై యుండెను. జనానాలోని స్త్రీలందఱును వారిఘోషా కేమాత్రమును లోపము లేకుండ నమర్పఁబడిన స్థలములోఁ గూర్చుండి చూచు చుండిరి. ఇరుతెగలవారును తమతమయోధునకే జయము కలుగవలయునని తలంచుట సహజమేకదా! యోధులిర్వు రును కత్తులఁ దూయుటకుఁ బూర్వ మొకవిచిత్రసంఘటనము ఘటిల్లెను. రంగస్థలమునుప్రవేశించుటకుముందు ఫతేజంగు తనయనుచరులకు రహస్యముగా నేవో కొన్నివిషయము

లక్షింగించుచుండగా రాణివాసమున కూర్చుండి యున్నకిటికీ
వెంట నొకబాణమువచ్చి యాతనివక్షస్స్థలముపై కవచమునకు
గ్రుచ్చుకొనెను. అది గాంచుటతోడనే మహమ్మదీయులంద
ఱును కత్తులందీసి లేచి యుద్ధసన్నద్ధులైరి. అంత హిందువులు
కూడ తొందరపడిరి. పోరుజరుగవలసినదేకాని ఫతేజంగు
శాంతివహించి తనయనుచరులనుగూడ శాంతింపఁజేసెను.
తరువాత ఫతేజంగు లేచి నిల్చి గంభీరకంఠస్వరముతో బాణ
మునకుఁ గట్టఁబడినచీటివలన నీబాణము కమలావతిచే విడు
వఁబడినదనియు, స్త్రీయైనను పురుషులకంటె నీమెయే సాహ
సికవీరవనితయనియు, నిట్టియామెపై మోహముచేఁ దాను
నేఁడు తనప్రాణములనైన తెగించి ద్వంద్వయుద్ధముచే
యుచుంటినని యుపన్యసించెను.

ఈయుపన్యాసమైనతరువాత నిర్వురుయోధులు
ను రంగస్థలముఁ బ్రవేశించిరి. ఇర్వురును తమతమజాతులలో
పేర్వన్నికెక్కిన యోధులతో తీసిపోనివారునై యుండిరి. వా
రిర్వురిలో రాజపుత్రుఁడు మంచియంగసౌష్ఠవముకలవాఁడు
ను, పొంకరియు నగుయోధుఁడు. ఆనాఁడు రామసింగుధరిం
చిన కవచాంగదాకులను తను వర్ణింప నేరికిని సాధ్యము
కాదు. శత్రునిచే బ్రయోగింపఁబడు నీటెపోటులుగాని కత్తి
వ్రేటులుగాని యాతనికవచముపై నీషణ్మాత్రమైనఁ బనిజేయఁ
జాలవు. యవ్వనుఁడును, శౌర్యధైర్యనుకీఁడును, సుందరుఁ

డునగునా యోధునిఁ గాంచి కమలావతి మోహావివశయైనదను టయం దతిశయోక్తి యేమికలదు? ఫతేజంగు తన ప్రత్యర్థిధరించినకవచాంగదాదుల కేమాత్రము తీసిపోని కవచమునుధరించి శత్రుని క్షణములో నోడించునేమోయనునంతటి ధైర్యోత్సాహములతో నుండెను. అతఁడు రామసింగునంతటిపొడవరి మాత్రముకాకపోయినను, విశాలమైనవక్షస్థలముకలిగి బలశాలియైనధీరుఁడౌటచే శత్రున కేమాత్రమును దీసిపోవు వాఁడుకాఁడు.

పోరు ప్రారంభింపఁబడియెను. ఒకరినొకరు డగ్గఱగానే యుద్ధము మొదట మహమ్మదీయునిచేఁ బ్రారంభింపఁబడియెను. మొదట ఫతేజంగు రామసింగుకవచముపై బలమైన దెబ్బగట్టిగాఁగొట్టెను. అంత నిరువురును తీవ్రముగఁ బోరు ప్రారంభించిరి. చాలవఱకట్లు పోరుసల్పిరి. కాని, యొకరికొక రేమాత్రమును తీసిపోకుండ నిరువురును సమానప్రతిభనే ప్రదర్శించుచుండిరి. అస్త్రకౌశలమునం దిరువురును సమానులేయగుటంజేసి జయ మేకరికగ్గునదియు నేర్పరించుట యసాధ్యముగా నుండెను. ఎట్టకేలకుఁ గోపోద్దీపితుఁడై రామసింగు గట్టిగా నొకదెబ్బ ఫతేజంగునుగొట్టగా నా తురుష్కునికంఠముపై గట్టిదెబ్బతగిలి పెద్దగాయ మేర్పడుటయు నంత ఫతేజంగు బలహీనుఁడై కొంతవెనుకకుజరుగుటయుఁ దటస్థించెను. కాని, తిరిగి యాతఁడు గట్టిదెబ్బను రామసింగు

తలపైఁ గొట్టుటయు, రామసింగు స్మృతిఁదప్పి నేలపైఁ బడి పోవుట తటస్థించెను. తనశరీరమంతయు రక్తసిక్తమై చాలగా యములు తగిలి ప్రాణాపాయస్థితిలోఁ దానున్నప్పటికిని చివరకు ఫతేజంగే విజయుఁడుగా నెంచఁబడెను.

సంతోషకరమగువిషయ మేమనఁగా, ఫతేజంగును, వానియనుచరులగు తురుష్కసైనికులును స్వేచ్ఛగా తాము దోచికొనినదోపిడితో పట్టణమునువీడిపో గలిగిరి. కొలఁది దినములలో శరీరారోగ్యమునుపొందినపిదప నొకశుభముహూర్తమున రామసింగు కమలానతిని బరిణయమాడి సత్సంతాన మునుబడసి సుఖముగానుండెను.



# రక్షాబహుమానము.

రాజపుత్రస్థానమందలి "నాగోర్" రాజ్యాధిపతియగు మానసింగు, చుట్టును విచారపూరితులగు మంత్రిసామంతాదులు పరివేష్టించియుండ, నాలోచనానిమగ్నమానసుఁడై యొకనాఁడు దర్బారుమందిరములోఁ గూర్చుండియుండెను. ఆనాఁటివారివిషాదమునకుఁ దగినంత హేతువు లేకపోలేదు. తమసంస్థానమందున్న సేననంతయుఁ దీసికొని రాజపుత్రులందఱును మొగలచక్రవర్తిపక్షమున యుద్ధముసల్పుటకై దక్కనుకుఁ బోయియుండిరి. ఆయదను కనిపెట్టి గుజరాతును పాలించుతురుష్కరాజు "నాగోర్" పైకి దండెత్తివచ్చెను. అదియే వారివిషాదమునకు హేతువు. నాగోర్ కోటను శత్రువులదయ కొప్పగించి పర్వతప్రాసాదమగు "గాడ్వార్"నకు యుద్ధమునకై పోకుండ మిగిలినవృద్ధులతోడను స్త్రీలతోడను మానసింగు వెడలిపోయెను. గాడ్వార్ దుర్గము శత్రుదుర్భేద్యమైనదైనను శత్రువులతోఁ బోరుటకు సేన లేకపోవుటవలనను, శత్రుసేన లెక్కకు మిక్కుటమై యుండుటవలనను గాడ్వార్ నుండి కూడ వారు వేఱొకరహస్యస్థలమునకుఁ బోవలసినవారయ్యు వీలులేకపోవుటచే దుర్గములో నుండిపోవలసివచ్చెను. అచ్చోటఁగూడినరసపుత్రులు పెక్కురు పెక్కువిధములగునాలోచనలఁ జెప్పిరి కాని, చివర

కు తమశక్తియున్నంతవఱకుఁ గోటను సంరక్షించుకొనుట కు నిశ్చయించుకొనిరి. మహమ్మదీయప్రభువగు ఫిరోజిషా సైన్యము నెదుర్కొని మానసింగునకు సహాయముచేయఁగలి గిన ధైర్యసాహసములుగల సంస్థానాధీశ్వరు లెవరు నా చుట్టుప్రక్కల లేకపోవుటం జేసి విరోధికి వశమగుటయో లేక పోరి చచ్చుటయో తప్ప వేఱుగత్యంతరము వారికి లేదు. కావున మహమ్మదీయులకు వశమై వారికి దాసులగుటకంటె మానసంరక్షణార్థమై మరణించుటయే మేలని రజపుత్రవీరవని తలందఱు నిశ్చయించుకొనిరి. శక్తియున్నంతవఱకు గోటను గాపాడి, సామర్థ్యంబులుడిగినపుడు భార్యలను పిల్లలను నగ్ని దేవున కర్పించి తాము శత్రువులతోఁ బోరి మరణించుటయే వీరపురుషోచితమని దర్బారులోనివారు నిశ్చయించుకొనిరి.

వారచ్చోటువీడి దర్బారునందు జరిగిన సంగతులు తమతమదారాసుతల కెఱింగించిరి. దర్బారులో జరిగినసంగ తులవినుటకై తహతహపడుచున్నవారిలో ముఖ్యురాలు సాహసికవారవనితయు, మానసింగున కేకపుత్రికయు నైన పున్నా. రాజపుత్రసంస్థానములందు ప్రతిరజపుత్రునకును స్త్రీసంతానము పెద్దబరువై కన్పట్టినను, మానసింగున కట్టి బాధ యీషన్మాత్రమైనను లేకపోవుటయే కాక, తక్కుంగల తనపుత్రులకంటెఁ బుత్రికయే కడుఁ బ్రేమాస్పదురాలై కన్పట్టు చుండెను. అద్దానికిఁ గారణము పున్నా కడసారిచిన్నబిడ్డయు

పరలోకగతయైన తనసహధర్మచారిణి కేకపుత్రికయు నగు టయె! ఆమెంగాంచినపుడెల్ల నెట్టివిషాదములోనున్నను మానసింగు సంతోషచిత్తుఁడగుటయేకాక గతించిన తనజీవితేశ్వరిని గాంచినంతయానందము ననుభవించుచుండెను. నేఁడు దర్బారునందు జరిగినవిషాదవిషయము నామె కెట్లు తెల్పెంగింతునాయని కుందుచు నాతఁడు జనానాలోఁ బ్రవేశించి, దర్బారులో జరిగిన విషయము లన్నియు విషాదముతో నచటివారి కెఱింగించి, భగవంతునియనుగ్రహ ముండిననేతప్పఁ గొలఁదికాలములో నందఱు మృత్యుదేవత కాహుతికావలసినవారలేయని యెఱింగించెను.

నూతేండ్లముదుసలియగు రాజమాత, రసపుత్రవీరమాత, శౌర్యధైర్యపరాక్రమధురీణయై తమ కాసన్నముకానున్నమృత్యుదేవతకు బలియగుటకత్యుత్సాహముతో ననుమతించుటయేకాక తనవంటివీరవనితలఁ బెక్కండ్రనుగూడ సంసిద్ధలఁగాఁజేసెను. ప్రాణములపైఁ దీపియుఁ బ్రాపంచికసుఖములపై వాంఛయుఁ గలకొందఱు వనిత లందుల కిచ్చగింపక రానున్నయాపత్తునకై దుఃఖించుచుండిరి. అమాయికలగుపసిపాప లేమియు నెఱుంగఁజాలక దుఃఖించుచున్నతమమాతల నాశ్చర్యముతోఁ జూచుచుండిరి. రాకుమారి పున్నామాత్ర మిసుమంతయు విచారముగాని, యుత్సాహముగాని వెలిపుచ్చలేదు. ఆమెతీరే యగమ్యగోచరముగా నుండెను.

తండ్రిచెప్పినవర్తమానమునువిని యామె వెంటనే తనశయ్యాగారమున కరిగి కిటికీయొద్ద నిలుచుండి మోచేతిని కిటికీపై నానుకొని చిగురుంగే లొకచెక్కిటనిలిపి గవాక్షమునుండి వెలుపలిప్రపంచము నవలోకించుచుఁ దీవ్రాలోచనానిమగ్న మానసయై యుండెను. ఆమెచూపు లొకక్షణము చంచలములై కొంతసేపటికి కనతిదూరములోనున్న యొకకొండపై నిలిచెను. ఆనిలుచుట చివరకు స్థిరత్వమునందెను. ఆలోచనాసముద్రమున నీఁదులాడుచుఁ దాను చూచిన "అరకొండ" పర్వతముపై గాలిలో నామె సౌధములు నిర్మింపమొదలిడెను.

అరకొండప్రభువగు "ఉమేద్‌సింగు" రెండువత్సరములకుఁ బూర్వ మొకనాఁడు నాగోరుపట్టణపువీధులలో స్వారి చేయుచుండఁగ నాతనిసౌందర్యమును, నంగసౌష్ఠవమును, యోధత్వమును పున్నా చూచి యాతని మనఃపూర్వకముగఁ బ్రేమించి యుండెను. అపు డాతఁడాసమీపముననేయున్న కొండదొంగలనందఱ నాశనమొనర్చి విజయోత్సాహముతోఁ బురవీధులనూరేఁగుచుఁ బోవుచుండెను. పున్నా యాతని నపుడు చూచి యాసుందరాంగుని యుద్వాహమాడినయువతిదే పవిత్రజన్మమనియెంచి తనకట్టియదృష్టము కలుగునా యని యోచించుచు నాతనినే పెండ్లియాడవలయునని స్థిరపఱుకొని యువ్విళ్లూరుచుండెను. నేఁడు మరలఁ బున్నా

కిటికీయొద్దనిలుచుండి వెనుకటివిషయములను జ్ఞప్తికిఁదెచ్చు
కొని యిపుడు తనకోర్కె నేలనెఱవేర్చుకొనఁగూడదాయని
యోచింప మొదలిడెను.

పవిత్రమగు ప్రేమ మృదుహృదయము నెన్నఁడుఁ బాల్ప
డుకదా ?

అంతకుఁ బూర్వమే కలిగినసరిహద్దుతగవులలో యు
ద్ధముసంభవింపకపోయినను, నాగోరురాజులకును, అరికొండ
రాజులకును ప్రబలవిరోధ మేర్పడుటచే స్నేహభావము లం
తరింప వారు పంక్తిభోజనములు లేకుండగఁజేసికొని సంబం
ధబాంధవ్యములను, ఇచ్చిపుచ్చుకోళ్లనుగూడమానుకొనిరి.
నిశ్చలమును, నిర్మలమునైనప్రేమతో ఉమెడ్ సింగును ప్రేమిం
చి, యికఁ దనకీలోకమునందైన నాతఁడే ప్రాణనాథుఁడని
స్థిరపఱచుకొనియున్న సాహసికరసపుత్రవీరనారీమణియగు పు
న్నాను, తనతండ్రికిని, ఉమేడ్ సింగునకునుగలవైర మావంత
యేనిఁ జలింపఁజేయఁజాలకపోయెను. అందువలన నిట్టివిప
త్సమయములందుకూడఁ బవిత్రమగునామెహృదయమం దా
కోర్కెలే మొలకలెత్తుచుండెను.

తలఁపనితలంపుగా నాశాపూరితమగు తలంపొకటి
యామెకుఁ గలుగుటంజేసి హృదయము మఱింత వేగముగాఁ
గొట్టుకొనఁదొడంగెను. అదేమనఁగా; ఇటివిపత్సమయము
లోఁ దనయాపదను తనహృదయనాథుఁడును, యోధాగ్రేస

రుండునగు ఉమెడ్‌సింగునకు నివేదించి సహాయము కోరిన చోఁ, దమకున్నవిరోధభావమ్లోమఱచి యాయోధుఁడు తమసహాయార్థమై తప్పకవచ్చితీరునని యామె నిశ్చయించు కొని "రత్నాబహుమానము" నాతని కంపుటకు నిశ్చయించు కొనెను. రత్నాబహుమానమనఁగా, నప్పటికాలాచారముగా నేరసపుత్రస్త్రీయైనను విపత్సమయము దొకవిలువైనరక్ష నొకరసపుత్రవీరున కంపినచో నాతఁడు దానిని స్వీకరించి తనసమ్మతిం దెలుపుచుఁ దిరుగ నొకవిలువైనబహుమానము నామె కంపుటయు నప్పటినుండి యామెరక్షణకొఱ కాయో ధుఁడు తనజీవములనహితము నరకుసేయక శ్రద్ధవహించుట యు, ఎట్టిసమయమందామెకోరినను తానామెరక్షణమునకు సంసిద్ధుఁడగా నుండుటయు ననునొకయాచారము. ఆయా చారము ననుసరించి పున్నా ఉమెడ్‌సింగునకు రత్నాబహు మానము నంపుటకు నిశ్చయించుకొని తీవ్రదుఃఖావేశముచే మైమఱచియున్నతనతండ్రిగదిలోఁ బ్రవేశించి యాతనిని వే రెవ్వరు లేనియొకనిర్జనప్రదేశమునకుఁ దీసికొనిపోయి యిట్లాక్రిం దివిధముగా సంభాషించెను.

"అరికొండరా జెన్నఁడైన మీయెడఁగాని, మీప్రతి నిధులయెడఁగాని మఱవరానంతయపచారమును గావించి యుండెనా" యని పున్నాయడిగెను.

"లేదు. కాని, సరిహద్దుతగవులలోఁ గొంతభూమికొఱ

కాతనికిని మనకును విరోధమేర్పడెను. అతఁడు యువకుఁడు; యోధుఁడేమైనను మహమ్మదీయులచే బాధపడుచున్న యిట్టి సమయమున నీకాతనిప్రసక్తి యెందులకు?" అని మానసింగనియెను.

"రత్నబహుమాన మాతనికంపవలయునని నిశ్చయించితిని. అతఁడు తప్పక మనసహాయార్థమై వచ్చి మనల నీవిపత్తునుండి రక్షించును." అని ధైర్యముతో పున్నాయనెను.

"ఏమీ! ప్రబలవిరోధియగు నాతనిసాయముకొఱకై యర్థించుటగా! అట్టితలంపును వీడుము." అని యుగ్రుఁడై మానసింగనెను.

కాని, మానసింగుని రౌద్రమును చల్లార్చు నుపాయమును పున్నా యెఱింగినట్లు మఱెవ్వ రెఱుఁగరు. మంచిమాటలచే ననేకవిధముల నచ్చఁజెప్పి యెట్టకేలకు పున్నా రత్నబహుమానమును ఉమెడ్‌సింగునకుఁ బంపునట్లుగాఁ దనతండ్రిని సమ్మతింపఁజేసెను.

సువర్ణమణిపుష్పములచే బహురమణీయముగా నిర్మింపఁబడిన రత్నబహుమానము నమ్మకమైనయోధుఁడగు నొక రసపుత్రయువకునిచే అరికొండకుఁ బంపుట కేర్పాటుగావింపఁబడెను. విరోధిసేనలను దుర్గసమీపమునకు రాకమునుపే నాశన మొనర్పవలెననియును, తెల్లవాఱినచో శత్రువులు అరికొండకుఁ బోనీయరనియును దలంచి వెంటనే యా రాయబారి

నొకతాఁటినిచ్చెనపైఁ గోటవెలుపలికిదింపగా నాతఁడాకటిక
చీఁకటిలో మాయమైపోయెను. ప్రదేశమంతయు రాతిమయమై
నడచుటకుఁ గష్టతరముగానుండినను నదివలె కలవాటుపడి
యుండుటచే నాతఁడాకటికచీఁకటిలోసైతము నక్షత్రగణము
లిచ్చుచున్నకొలఁది వెలుతురుసహాయముగా నతిత్వరితముగా
ను నిశ్శబ్దముగాను అరికొండవైపు తరలిపోవుచుండెను. కాని,
ప్రదేశమంతయు శత్రుమయమై యుండుటచే శత్రువులకంట
నెక్కడఁ బడిపోదునోయనుభయ మనుక్షణము నాతఁడు
పొందుచునేయుండెను.

అతిసాహసముతో నాతఁడట్లు పోవుచుండఁగా నాక
స్మికముగా నొకఁడాతనిపైఁ బడుటయు, నంత నిర్వురు నొక
రిపైనొకరుపడి క్రింద దొరలుటయుజరిగెను. చిన్నవాఁడను
నుద్దేశముతో మహమ్మదీయుఁడా రాయబారికుడిచేయిపట్టు
కొని నిర్లక్ష్యముగా వెలుతురున్నవైపునకుఁ దీసికొనిపోవు
చుండెను. రాయబారితలలోని రత్నాబహుమానమునుగాని
మొలలోనివాఁడిబాకునుగాని యామహమ్మదీయుఁడు కనుఁ
గొనియుండలేదు. చూచియేయుండినచో నాతఁడంతనిర్లక్ష్య
ముగా నుండియుండఁడు. తెలివితేటలుగలయువకుఁడైన యా
రాయబారి మహమ్మదీయునివెంటపోవుచున్నట్లుగానే నటించి
మొలలోనిబాకును మెల్లగాఁ దీసి యామహమ్మదీయునిచేతి
లో గట్టిగా గ్రుచ్చివేయుటచే నామహమ్మదీయుఁడు పెద్దగా

వఱచుచు నేలపైఁ బడిపోయెను. రాయబారి యతిరయమునఁ బాఱిపోయెను. పరుగెత్తుచున్న సమయమున బహుమానరక్షఁ దాఁచియుంచఁబడిన యాతనితలపాగ నేలపైఁ బడిపోయెను. వెనుక మహమ్మదీయుఁడు తరుముచుండెను. ఏమి చేయుటకును వీలు లేనియట్టిసమయమున యుక్తిపరుఁడగు నా రాయబారి చటుక్కున నొకప్రక్క కొదుగగా నాతనితఱుముచున్న మహమ్మదీయుఁ డాచీఁకటిలో నదిగాంచ లేక తిన్నగాఁ బరువెత్తికొనిపోయెను. అంత నారసపుత్రియునకుఁడు తలపాగ పడిపోయినచోటికిఁబోయి దానిందీసికొని మరలఁ దనప్రయాణము నతిత్వరితగతిని సాగించుచుండెను. దెబ్బతినిన మహమ్మదీయుఁడు గట్టిగానఱచుటచే దక్కుంగల మహమ్మదీయులు కాగడాలతో శబ్దమువచ్చిన వైపునకుఁ జేరుకొనుచుండిరి. ఆసమయమున నశ్వము నధిరోహించియున్న మహమ్మదీయనాయకుఁడు ప్రదేశమంతయు రాతిమయమై యుండుటచే గుఱ్ఱముపైఁ బోవుటకంటె నడచిపోవుటయే సులభమని తలంచి గుఱ్ఱముపైనుండిదిగి ప్రక్కనేయున్న యొక బాలసేవకునకిచ్చి శబ్దమువచ్చిన వైపునకుఁ బోయెను. ఆసమయమున నాప్రక్కనేయున్న రసపుత్రరాయబారి యిదియంతయు గాంచుచు, నాసమీపమున మహమ్మదీయసేనానాయకులెవ్వరు లేకుండుట యెఱింగి యాబాలసేవకునిఁ బ్రహరించి గుఱ్ఱపుఁగళ్లెమునులాగికొని దాని నెక్కి నతిరయమున అరికొం

డ వైపునకు త్వరితచేయుచుండగాఁ జంద్రోదయమయ్యెను. అందువలన నాతనికి మార్గము మరింత సుగమమయ్యెను. అతఁ డప్పుడు మఱింతత్వరితముగాఁ బోవఁదొడఁగెను. ఆబాలసేవకుఁ డఱచుటచే మహమ్మదీయు లచ్చోటికిఁ జేరి జరిగినసంగతివిని తమయశ్వము నధిరోహించి పాఱిపోయినరాయబారి వైపునకుఁ జంద్రకాంతిసాహాయ్యమునఁ బరువిడసాగిరి. కాని, యప్పటికప్పుడే యాతఁడు చాలదూరముపోయెను. రసపుత్రరాయబారి యొక్కరుపరుగునఁ బోయిపోయి కొండప్రదేశమునువీడి అరికొండసమీపముననున్న నదిలోనియిసుకలో నత్యుత్తమమైనతనగుఱ్ఱమును పోనిచ్చుచుఁ దన్నువెను దఱుముచున్నవారిసంఖ్య క్రమముగాఁ దగ్గుచున్నదని తెలిసికొనెను. ఎట్టకేలకుఁ దెలతెలవాఱుచున్నప్పటి కాతఁడు అరికొండదుర్గద్వారమును చేరుకొనియెను. అప్పటికి దుర్గములోనికాహారపదార్థములను దెచ్చువారికొఱకై దుర్గద్వారములు తెఱవఁబడియుండుటఁగాంచి తన్నుఁ గాపలావారి కెఱింగించుకొనఁగా నారాయబారిని వారు లోనికిఁ గొంపోయిరి.

రసపుత్రరాయబారి లోనికిఁబోవుసరి కశ్వారోహులగు ననేకయోధులతో ఉమేద్‌సింగు వేటకుఁబోవుటకై సంసిద్ధుఁడై యుండెను. రాయబారికి ఉమెద్‌సింగును వెంటనున్నవారు చూపినతోడనే యాతఁడు తనగుఱ్ఱమునుదిగి క్షణములో ఉమెద్‌సింగును సమీపించి రత్నాబహుమానమును,

తనకు సాహాయ్యముచేయుమని పున్నాఁ వ్రాసినజాబును నాత నికిచ్చెను. రహెూబహుమానమును స్వీకరించి యుత్తరమును జదివికొని ఉమెడ్‌సింగు తనకతిథిగావచ్చి తనప్రక్కనేయున్న జలీమ్‌సింగుతో మృగములవేఁటకన్న మిన్నయగు వేఁటయే లభించినదని యుత్సాహముతోఁబలికి, గాడ్వార్ కోటను ఫిరో జిషాముట్టడించియున్నాఁడనియుఁ,దత్పురాధీశ్వరుఁడగుమాన సింగుసంరక్షణార్థమై పోవలయుననియుఁ జెప్పగా జలీమ్‌సింగు తనవెంటవచ్చిన యేబదిమంది యోధులతోఁ దానుగూడ వచ్చి మహమ్మదీయులతోఁ బోరాడుదునని పొచ్చరించుచు, యు ద్ధమునకుఁ బోవుటకై తక్షణమే సర్వమును సిద్ధముచేయున ట్లుగా సేనానాయకుల కాజ్ఞాపించి సాహసికుఁడగు నారాయ ణారికి హృదయపూర్వకాహ్వానమొసంగి లోపలికిఁదీసికొని పోయి సకలోపచారములఁ గావించి సేదదేర్చెను.

నాఁటి వేకువజామున నే మానసింగు సేనలోని యొక దేశ ద్రోహి-రాజద్రోహి-స్వామిద్రోహి-అగు రసపుత్రుఁడు మహ మ్మదీయులలో జేరి కుట్రపన్ని తెల్లవాఱకమునుపే నిచ్చెనల సాయమున దుర్గప్రాకారముల కెగఁబ్రాకు ప్రయత్నములఁ జేయించెను. వానితో మహమ్మదీయసైనికులు కొందఱు నిచ్చెనలవెంట దుర్గముపై కెగఁబ్రాకిరి. కాని, వారు పూర్తి గాఁ బైభాగమునకుఁ జేరకమునుపే దుర్గసంరక్షణార్థమై నియ మింపఁబడియున్న సైకులలు నిచ్చెనలను క్రిందికిఁ బడఁద్రో

యుట యేకాక రాజద్రోహియగు నారసపుత్రునిశిరమును ఖం
డించి మహమ్మదీయసేనామధ్యమునఁ బాఱవేసిరి. మహమ్మ
దీయులు తమముఖ్యపట్టణమునుండి మరఫిరంగులు, మందుగుం
డ్లు మొదలగునవి వచ్చువఱకు ముట్టడిప్రయత్నములఁ బ్రారం
భింపకుండుటకు నిశ్చయించుకొని యపివచ్చినతోడనే ప్రాకా
రపుగోడలను మరఫిరంగులతోడను, మందుగుండ్లతోను బ్రద్ద
లుగొట్టుటకు కోటముందు విడిసియుండిరి. ఆనాఁటిరాత్రియే
ఉమెద్‌సింగువద్దనుండి తిరుగ బహుమానమువచ్చుటయేకాక,
ఉమెద్‌సింగుతోఁగూడజలీమ్‌సింగు తనయోధులతో గాడ్వార్
సహాయార్థమై వచ్చుచున్నాఁడనువార్త దుర్గములోనివారికం
దఱకును దెలియఁగానే వారియుత్సాహమునకు మేర లేకుం
డెను.

ఐదువేలసైనికనికాయమునకు ఉమెద్‌సింగును, జలీమ్
సింగును నాయకత్వమువహించి అరికొండనుండి బయలుదేఱిరి.
మహమ్మదీయులసేన వారిసేనకన్న మూఁడురెట్లెక్కువగా
నుండుటచే నెదురుగాఁబోయి వారితోఁ బోరుట యంతగా
శ్రేయస్కరముకాదని యెంచి యారసపుత్రవీరసింహములు,
శత్రుసేనకుఁ దమముఖ్యపట్టణమగు అహమ్మదాబాదునుండి
యెట్టి సాహాయ్యమును రాకుండఁజేయుట కుద్దేశించి, తమసే
నతో అహమ్మదాబాదునుండి గాడ్వార్‌నకువచ్చు పెద్దబాట
వైపునకుఁబోయి యచ్చటఁ గాచియుండిరి. ఇంతలో నొకరస

పుత్రియాశ్వికుఁ డతిరయమునవచ్చి అహమ్మదాబాదునుండి కొంతమహమ్మదీయసేన మరఫిరంగులతోను మందుగుండ్లతోను వచ్చుచున్నదని తెల్పుటతోడనే ఉమెడ్‌సింగు రెండు వేలయోధులతో వారికెదురుగాఁబోయి కొంతదూరమున తనసేనను బాట కిరుప్రక్కలనద్రి మహమ్మదీయు లచ్చోటికి వచ్చినతోడనే వారిపైఁబడుట కాజ్ఞయిడెను. మఱికొంతసేపటికి బండ్లమీఁదను ఏనుఁగులమీఁదను, ఫిరంగులు మొదలగు సామానులను మోయించుకొనుచు మహమ్మదీయు లచ్చోటికిఁ జేరఁగనే రసపుత్రు లొక్కుమ్మడిని వారిపైఁబడి పెక్కుర హతమార్చి ఫిరంగులాదిగాగలయుద్ధసామగ్రి నానమీప మందేయున్నతటాకమునఁ బాఱవైచి, తక్కుంగలమహమ్మదీయులను చెఱఁబట్టి తమసేనలోఁ గలిసికొనిరి.

అహమ్మదాబాదునుండి గొప్పసాహాయ్యమునకై యెదురుచూచుచున్నఫిరోజిషా యిదియంతయుఁ దెలిసికొని నిరుత్సాహుఁడై తమ కపజయ మెటులైననుఁ దప్పదని నిశ్చయించుకొని ప్రాణములతోనైనను దిరిగి జన్మభూమికిఁ బోగల్గుదుమా లేదాయని విచారింపఁదొడంగెను. రసపుత్రుల కీర్తివిజయము చేకూరినదని వినుటతోడనే యుద్ధమునకుఁబోక యుండ్లయొద్దనున్న వృద్ధరాజపుత్రులుకూడ చుట్టుపట్లగ్రామాదులనుండివచ్చి ఉమెడ్‌సింగుసేనలోఁ జేరిరి. మహమ్మదీయులసేనల కాహారపదార్థములైపోయెను. ఇఁకఁ గోటలో

సికిఁ జొరఁబడి కోటలో నెక్కువగా నిలువయుంచఁబడిన యాహారపదార్థములను దోఁచుకొనుటతప్ప వారికి వేఱుగ త్యంతరములేదు. కాని, కోటలోనికిఁ బ్రవేశించుట కెట్టిమార్గమును గానరాకుండెను. అందువలనఁ గోటముం దొకయగాధమగునగడ్తను త్రవ్వించి దానిని తమయొద్దనున్నమందుగుండ్లతో నింపి దానికి నిప్పంటించి కోటగోడలు బ్రద్దలుకొట్టుటకై ప్రయత్నముచేసిరి. ఇదిగాంచి ఉమెద్‌సింగును జలీమ్‌సింగును మహమ్మదీయులపైఁబడి ఘోరయుద్ధముసలిపి మహమ్మదీయులనెల్ల చెల్లాచెదరుగావించివైచిరి. కాని, నాఁటికి జయమెవ్వరికిని గలుగలేదు. పొద్దుగ్రుంకుటచే ఇరుతెగలవారును పోరుమాని యెవరిపటకుటీరముల వారు చేరుకొనిరి.

నాఁటిరాత్రి ఫిరోజుషా తనరాజధానినుండివచ్చుమార్గమునందున్నరసపుత్రసేన నెట్టులైన చెదరగొట్టకపోయినచో రాజధానినుండి తమకెట్టిసాహాయ్యము రాదనియు, దానివలనఁ దనసేనయంతయుఁ దిండిలేక మాడిపోవలయుననియుఁ దలంచి మఱునాఁటియుదయముననే తనసేననంతను మార్గమును నిరోధించుచున్నరసపుత్రసేనపైకి మరలించుకొనిపోయి వారితోఁ బోరుసాగించెను. ఉమెద్‌సింగుజలీమ్‌సింగు లిది గాంచి యెన్నియోరీతుల తమసేననునడిపించుకొనుచుఁబోయి మహమ్మదీయుల కెట్టిజయమును గలుగనీయకుండఁ దమసాహసమును వెల్లడించుచుండిరి. ఇరుతెగలందును పెక్కురు

యోధులు సమసిపోయిరి. ఉమెడ్ సింగుమాత్రము భారతీయ పతాక నెగురవైచుచు మహమ్మదీయులఁ జెండాడుచు దుర్గ ద్వారమువైపునకుఁ బోవుచుండెను. ఇదిగాంచి మహమ్మదీయులు మరల రసపుత్రులపైఁ దలపడిరి. కాని, రసపుత్రులతి సాహసధైర్యోత్సాహములతో వైరుల నఱుకుమాడుచు దుర్గము వైపునకుఁ బోవుచుండిరి. ఆకస్మికముగా ఉమెడ్ సింగు తన సేనతో నాగిపోయెను. ఇదిగాంచి మహమ్మదీయులు రసపుత్రులు లొంగిపోయిరని సంతోషించి వారిపైఁబడ నుంకించిరి. కాని, రసపుత్రులట్టులాగుట నిమేషమాత్రము శ్రమఁ బాపుకొనుటకుమాత్రమే యైయుండుటచే వెంటనే వారు మహమ్మదీయులపైఁబడిరి. ఆసమయముననే కోటగోడలపై నుండి పెద్దపెద్ద రాళ్ళను మహమ్మదీయులపై దొరలిపడుటచే మహమ్మదీయసేన రెండువిధములుగా నాశనమగుచు తటుసించెను. ఆయొత్తిడికి నిలువలేక మహమ్మదీయులు చెల్లాచెదరై పాఱిపోయిరి.

వెంటనే దుర్గద్వారములు తెఱవఁబడుటచే ఉమెడ్ సింగు విజయోత్సాహముతోఁ గోటలోఁ బ్రవేశింపగా మానసింగును నచ్చటఁగలత్క్షుఁగలవారందఱు నాతని వేనోళ్లఁ బొగడుచు హృదయపూర్వకాహ్వానములతో ముంచివైచిరి. ఇఁక నేవిధముచేతను తనకు జయమురాదని యెఱుంగుటచే ఫిరోజిషా యాసలన్నియు విడనాడుకొని రాజపుత్రు

లతో మంచిచేసికొని మఱునాఁడుదయమున మిగిలినతనసే
నతో తనరాజ్యమునకు వెడలిపోయెను.

మహమ్మదీయులు వెడలిపోయినపిదప రసపుత్రులం
దఱు నొకచోఁగూడి ఉమెద్‌సింగు ననేకవిధములఁ గొనియా
డిరి. మానసింగు తనసంస్థానమందలి వెలలేనిరత్నములనేకాక
వలయుచో గాడ్వార్‌దుర్గమునే ఉమెద్‌సింగునకుఁ గానుకగా
సమర్పించుటకు సంసిద్ధుఁడనై యుంటినని చాటెను. ఉమెద్
సింగుమాత్రము తనకవేవియు వలదనియును, గాడ్వార్ సంస్థా
నమునకేకాక రసపుత్రవంశమునకే వన్నెదెచ్చుచున్నరత్నము
మాత్రమే తనకుఁ గావలయుననియు చెప్పెను. అదివిని
మానసింగు తనపూర్వులనాఁటినుండియు నున్న పెద్దరత్నము
నాతఁడు కోరుచున్నాఁడని తలంచి యటులేయనెను. ఉమెద్
సింగు కోటిరత్నములకన్న విలువయగుపున్నామాత్రమే తన
కుఁగావలసినరత్నమని తెలియఁజెప్పగానే మానసింగు మిక్కి
లిసంతోషించి యంగీకరించెను.

కొలఁదిదినములలో నొకశుభముహూర్తమున సకల
సామంతాదులను, బంధుమిత్రులను, భూసురోత్తములను
రావించి ఉమెద్‌సింగునకు పున్నారత్నమునిచ్చి గొప్పవైభవ
ముతోఁ బరిణయమహోత్సవమొనరించెను. తరువాత నావేరి
మదంపతులు సంతోషముగా చాలకాలము రాజ్యసుఖముల
ననుభవించి సాహసికులగుసత్పుత్రులంగాంచి చిరకీర్తులైరి.

# ప్రవాసితుఁడు.

చాలకాలమునకుఁ బూర్వ మొకనాఁడు రాజపుత్రస్థానమందలి ప్రసిద్ధరాజ్యములలో నొకటగు 'ధర్' రాజ్యపు ముఖ్యపట్టణమునువిడిచి యడవివైపునకు సహస్రాధికసేనాసమూహమొకటి తమనాయకునితోఁ బోవుచుండెను. సైనికులందఱు ధైర్యసాహసములుగలయోధులేయైనను వారియాకారములఁగాంచినవారికి వారు విచారగ్రస్తులైయున్నారని తెలిసికొనుట కంతకష్టముగాలేదు. ఆసేనానాయకుఁ డందఱికన్న నెక్కుడువిషాదముగఁ గన్పట్టుచుండెను. అతఁడు ధరించియున్న నల్లనిదుస్తులును, అతనిహస్తమునందున్న నల్లనిపిడిగలఖడ్గమును, ఆతఁ డధిరోహించిన నల్లనిగుఱ్ఱమును ఆతనివిషాదమును చెప్పకయే చెప్పుచుండెను. తనతండ్రి తనకు విధించిన దుస్సహదుర్భరప్రవాసశిక్షయే యాతనివిషాదమునకుఁ గలకారణము. ప్రియతమమగు జన్మభూమి నాక్షణమందే విడిచిపెట్టుటయేకాక మరలఁ దనజీవితకాలములో నెన్నఁడును తనజన్మభూమికిఁ దిరిగివచ్చుటకు సైతము వీలులేనట్లుగా హిమతుసింగునకుఁ బ్రవాసశిక్ష విధింపఁబడెను. ఇంతటి ఘోరశిక్ష హిమతుసింగుపొందియుండుటకుఁ గారణ మాతఁడు తన తండ్రికి మొదటికళత్రపుసంతానమగుటయు, తనతల్లి నీర స్వర్గమునుగాంచియుండుటచేఁ దనతండ్రి మరలవివాహము

చేసికొనుటయు నైయుండెను. సూజాబాయిని ద్వితీయకళత్ర ముగఁ బరిగ్రహించినకొలఁదికాలములోనే యామె కొకపుత్రుఁడు కలిగెను. అతఁడే బప్పాలాలు. సూజాబాయివలలోఁ జిక్కినయాపెనిమిది యామెమాటఁదాఁటనిరాజ్యార్హుఁడును, సాహసికవీరుఁడును, నవయౌవ్వనరూపవిలాససంపన్నుఁడును, బుద్ధిమంతుఁడును అగుపెద్దకొడుకును గానలపాలుచేయుట కుసాహసించినరాజు బుద్ధిమాంద్యమున కాపట్టణములో విచారింపనివారు లేరు.

పూజ్యుఁడగు తండ్రియందలిగౌరవముచేనేమి, తనమంచితనముచేనేమి, సౌందర్యవతియుఁ, బరాక్రమశాలియు, యువతీమణియు నగుతనయిల్లాలినేకాక మానవునకన్నిటికంటెను ప్రియతమమగు జన్మభూమినిగూడ విడిచి తనయందలి గౌరవముచేఁ దన్ననుసరించుచు వచ్చుచున్న వేయిమందియోధులతో 'ఖోక్' రాజ్యమును విడిచి యువరాజడవులఁబడి పోవుచుండెను.

అట్లుపోవుచుండినవారు వారముదినములు ప్రయాణముసాగించినచో మొగలాయీరాజ్యపుసరిహద్దులలోఁ బ్రవేశింతురు. ఆదినములలోనే మొగలాయిచక్రవర్తి గుజరాతు దేశముపై దండెత్తుటచేఁ దనసైన్యమునంతను దీసికొనిపోవుటయేకాక రాజపుత్రస్థానపుసరిహద్దులలో నున్నసైన్యమును గూడ యుద్ధమునకుఁ దీసికొనిపోయియుండెను. ఆయదను

కనుఁగొని మొగలాయిలకును రాజపుత్రులకును సరిహద్దు లలోనున్న "బార్" అను మొగలదుర్గమును సులువుగాఁ దమ వశముగావించుకొనవచ్చునని తలంచి హిమతుసింగు తనయనుచరుల కెఱిఁగింపఁగా వారందుల కుత్సాహముతో నంగీకరించిరి. అందువలన వారతిరయముసఁ బ్రయాణమునుసాగించి దారిలో మొగలాయిలచే నెట్టినిరోధమును గాంచకుండ తొమ్మిదవనాఁటియుదయముననే పెద్దకొండపై నిర్మింపఁబడిన బార్ దుర్గముముందు విడిసిరి. ఇచ్చట కూఁడ వారి నదృష్టదేవతయే వరించెను. కోటసంరక్షణార్థమై యుంపఁబడిన కొలఁదిసైనికు లెట్టిభయమును లేదని తలంచి వేఁటకొఱకై యందఱును దుర్గమునువిడిచి పోయిరి. రాజపుత్రు లదియెఱింగి దుర్గద్వారములసమీపించి చెదరి రహస్యస్థలముల దాఁగుకొనియుండిరి. కొంతసేపటికి మొగలులు తాముచంపిన జంతువులతోఁ దిరిగి రాఁగా వారికొఱకు దుర్గద్వారములు తెఱవఁబడెను. మొగలులు దుర్గములోఁ బ్రవేశింపఁబోవుచుండుసమయమున రసపుత్రులు తాముపొంచియున్నస్థలములనుండి యొక్కుమ్మడిగ వారిపైఁబడి మొగలసైనికుల నందఱ హతమొనరించిరి. వారట్లు పోరుచున్నసమయమునఁ గోటలోనున్న మొగలులు, రసపుత్రులు కోటలోఁ బ్రవేశించుటకు వీలులేకుండ దుర్గద్వారములను మూసివేసిరి. ఇది గాంచి హిమతుసింగు తనయనుచరులను కోటవెనుకభాగము

నకుఁబంపి నిచ్చెనలసహాయ్యమున లోనికిఁదిగి దుర్గద్వారము లు దెఱచునట్లుగా నాజ్ఞాపింపఁ దక్షణమే వారట్లొనర్చిరి. వెంటనే హిమతుసింగు తనసైనికులతోలోనఁబ్రవేశించి మొగలాయిలస్వాధీనములోనున్న యభేద్యమగు "బార్" దుర్గమును సునాయాసముగఁ దనవశముగావించుకొనియెను.

బార్ దుర్గము ఎత్తైనయొకకొండపైని నిర్మింపఁబడిన దై చుట్టునున్న కొండలుదానికిఁబెట్టనిగోడలై పరిఢవిల్లుచు శత్రులకభేద్యమైనస్థానముగా నొప్పుచుండె. దానికిఁ జేరిన రాజ్యము బహువిశాలమైనది. రాజపుత్రులు దుర్గములోఁ బ్రవేశించి యచ్చట నెక్కువగానున్న యాహారపదార్థములును యుద్ధమునకక్కఱకువచ్చు వస్తుసముదాయమును దమ వశముగావించుకొనిరి. దుర్గములో మొగలసైనికులు భక్షించుటకుఁ జాలయావులుకూడఁ గలవు. ప్రాకారపుగోడలన్నిటి మీఁదను సమయమువచ్చినపుడు క్రిందనున్నసైనికులపై దొరలించుటకుఁగాను పెద్దపెద్దరాళ్ళుకూడ నమర్పఁబడియుండెను. కొంతకాలమువఱకు వారెట్టివిరోధము లేనివారై తమ వశమైనదుర్గమునందు నిశ్చింతులై యుండిరి. కాని, యేమఱి మాత్ర ముండలేదు. చుట్టుప్రక్కలనున్న పల్లెలకుఁ బోయి కూడ వారు ధనధాన్యాదులను కొల్లగొట్టుకొనివచ్చి దుర్గములోఁ జేర్చుచుండిరి. కొలఁదిదినములలోనే కొలఁదికొలఁదిగా మొగలాయిసేనవచ్చి దుర్గమును ముట్టడించుచుండెను.

క్రమముగా కొన్నిదినములలో మొగలసేన యధికమై దుర్గమును పూర్తిగా ముట్టడించివేసిరి. దుర్గమును ప్రవేశించుటకనేకప్రయత్నములు చేసిరి. కాని దుర్గమును స్థైర్యోత్సాహములతో రసపుత్రులు సంరక్షించుచుండుటచే మొగలాయిల ప్రయత్నములు విఫలములయ్యెను. తమయొద్ద కొలఁదిగనున్న మందుగుండ్లతో మొగలు లొకటిరెండు పర్యాయములు దుర్గప్రాకారములను భేదించుటకుఁ బ్రయత్నించిరి. కాని, ప్రయోజనము లేకపోయెను.

తనప్రయత్నములందు విఫలుఁడై మొగలసేనానాయకుఁడైన అసఫ్‌ఖాను వేశోకపన్నుగడ పన్నెను. తమయొద్దనున్న పెద్దయేనుఁగులచే దుర్గద్వారముల డీకొలుపఁజేసి వానిని బ్రద్దలుకొట్టించుటకూహించెను. కాని, రసపుత్రులు పెద్దపెద్దరాతిబండలను క్రిందికి దొరలించుచుండుటచే నేనుఁగులుసహితము దుర్గద్వారములను సమీపించుటకు వీలులేకుండెను. ఇదిగాంచి అసఫ్‌ఖాను వేఱుమార్గముగానక తమ గుడారములనుండి దుర్గద్వారములసమీపమువఱకు నేనుఁగులువెళ్ళుటకు వీలుగానుండునంతటి కప్పునొకదానిని నిర్మించునట్లాజ్ఞాపించెను. రెండుమూఁడుదినములలోఁ బ్రభునియాజ్ఞచొప్పున పలుపాట్లకులోనై మొగలాయిలు కప్పును ఆయత్తపఱిచిరి. తమప్రయత్నము లిఁక ఫలోన్ముఖములయ్యెననుసంతోషమున నాఁటిరాత్రి మొగలసైనికులందఱు మెక్కువగా

మద్యపానముం జేసి విందారగించుచుండిరి. పాపము దుర్గములోనున్న రసపుత్రు లేవిధమునను బైటికిరాలేదుకదాయని వారు తలంచియుండిరి. తానొకటితలంచిన దైవమొకటితలంచునను సామెత సత్యముయ్యెను. హిమతుసింగెంతపరాక్రమవంతుఁడో యంతటియుక్తిపరుఁడు. మొగలాయిల్గుఁ ఒడలు తెలియకుండ విందారగించుచుండిరని తెలిసికొని యర్ధరాత్రిసమయమునఁ గొందఱుయోధుల వెంటనిడికొని దుర్గమునుండి బయటికివచ్చురహస్యమార్గమున వచ్చి మొగలాయిలు నిర్మించినకప్పను నూనెతోఁ దడిపి నిప్పంటించి పూర్తిగా విధ్వంసమొనర్చిరి. గాలి యనుకూలముగానుండుటచే నతికష్టముతో నిర్మింపఁబడిన యాకప్ప నిమిషమాత్రములో భస్మమైపోయెను. ఇదిగాంచుటతోడనే మొగలాయిలగుడారములలోఁ గలవర మదయించెను. తమపని బూర్తిగావించుకొని రసపుత్రులు మరల రహస్యమార్గమున దుర్గమునఁబ్రవేశించిరి.

మొగలాయీలు స్థిరసంకల్పులైయుండుటచే నిరుత్సాహులుకాక పెక్కుప్రయాసలకులోనై కప్పను మరల నిర్మించిరి. వారియొద్దనున్న మత్తగజములన్నింటిలోను మూఁడుమాత్రమే దుర్గద్వారముల డీకొని విఱుగఁగొట్టఁగల శక్తిగలవి. ఒకదానివెనుక నొకటిగా గుడారములకడనుండిదుర్గద్వారములయొద్దకు మత్తగజములను కప్పక్రిందినుండి తీసికొనివచ్చిరి. బారదుర్గముయొక్క ద్వారము లతినైపుణ్యము

తో నిర్మింపఁబడియుండెను. ద్వారమునకుముందు బరువును లావునుగల వాఁడియగుకోణములుకలిగిన యినుపయూఁచల తో నల్లిక యమర్పఁబడియుండెను. మొదట నొకయేనుఁగు ద్వారమును ఢీకొనుచుండెను. ఇదిగాంచి రసపుత్రిలొక పెద్దరాతిబండను క్రిందికి దొరలింపఁగా నది యేనుఁగుతలపైఁ బడుటచే నామత్తగజము తలవ్రక్కలై పెద్దగా నఱచుచుఁ గొంతదూరముపరువెత్తుకొనిపోయి నేలపైఁబడి మృతినం దెను. తరువాత రెండవయేనుఁగుచేఁ గూడ నట్లేచేయించిరి. కాని, యిది దుర్గద్వారమున కమర్పఁబడిన వాఁడియూఁచలు గ్రుచ్చుకొనుటవలనఁ గలిగినబాధకు సహింపలేక వెనుదిరిగి పాఱిపోయెను. ఇఁక మొగలులయాశయంతయు మిగిలిన యొక్కయేనుఁగుపై నాధారపడియుండెను. మూఁడవయేనుఁ గునుగూడ యథారీతిగనె ద్వారధ్వంసనమునకు విడిచిపెట్టిరి. అదిమాత్రము తక్కినరెండింటివలెఁగాక కడుసామర్థ్యముతో దుర్గద్వారమును ఢీకొనుచు ఫెళ ఫెళలాడించుచుండెను అట్టి సమయమున దుర్గద్వారపు పైభాగమునుండి యొకత్రాటి మూలమున హిమతుసింగు సరిగా నేనుఁగుపైనున్న హౌదా లోనికిదిగి గజమును నడుపుచున్నవానిని సంహరించి తన వెంటఁదీసికొనివచ్చిన సుత్తితో సూదియగు నొకయినుప యూఁచను నామత్తగజమునడినెత్తిలో దిగఁగొట్టగా నది పెద్దగా నఱచుచు నేలపైఁబడి మృతినందెను. ఇదిగాంచి

మొగలసైనికులు హిమతుసింగుపైఁబడ పర్వెత్తి వచ్చుచుం డిరి. వారిరాకఁగాంచి హిమతుసిం గెట్టియపాయమునకులోను గాకుండఁ దాను దిగివచ్చినత్రాటిసాహాయ్యమున దుర్గద్వార పుపైభాగమునకు సులువుగాఁ బోయి తనసాహసమునకు మొగలసైనికు లచ్చెరువందున ట్లొనర్చెను.

ఇట్లు తెల్లవిధముల విఫలప్రయత్నులై మహమ్మదీయు లు కోటముం దొకపెద్దయగడ్తను త్రవ్వించి యందు మందు గుండ్లనమర్చి వానికి నిప్పంటించి దుర్గద్వారముల బ్రద్దలు కొట్టనేర్పాటునం దుండిరి. మఱునాఁటిసాయంసమయమున నచ్చోట నివసించుచుండెడి యొకగొల్లవాఁడు మొగలసేనా నాయకునిగుడారములోనికి వచ్చెను. వాఁడు హైందవుఁడే యైనను, ధనాశాపరుఁడై తనకు బహుమానముగఁ జాల ద్రవ్యము నిచ్చినచో దుర్గమునఁ బ్రవేశించుట కున్నరహస్య మార్గమును జూపింతునని వారల కెఱింగింపఁగనే వారాతని కిఁ గొంతద్రవ్యము నిచ్చిరి. ఆనాఁటియర్ధరాత్రిసమయమున మొగలసేనానాయకునియల్లుఁడును యోధుఁడు నగుకాశిం ఖానునుయువకుఁడు మఱియైదువందలసైనికులతో గొల్లవాని వెంబడిని రహస్యమార్గముంబట్టి దుర్గమునఁ బ్రవేశించుటకై యామార్గము ననుసరించిరి. మార్గము కడుకంటకమయమై దుర్గమమై భయంకరమై వారు సులువుగాఁ బోవుట కతికష్ట తరముగా నుండెను. దారి కడుసన్నముగా నుండుటచే వా

రొకరివెనుక నొకరు బహునిశ్శబ్దముగాఁ బోవలసివచ్చెను.
మార్గమం దెన్నియో రాతిదిబ్బలును, వృక్షసముదాయము
లును, అగడ్తలును నీటిధారలును వారిప్రయాణమున కాటం
కములు గలిగించుచుండెను. ఇదివఱకా దారిని బాగుగ
నెఱింగినదుర్మార్గుఁడగు నాగోల్లుఁడు ముందుగ నడచుచు వారి
చూపుచుండఁగా వానివెనుక నొక్కరొక్కరుగా మొగలయో
ధులు పోవుచుండిరి. కొంతసేపటికి వారనేకకష్టములకు లో
నై చాలవఱకు పైకిఁబోయి దుర్గముయొక్క గోడయుపరిభాగ
మునొద్దకుఁ జేరుకొనిరి. వెంటనే కాశింఖాను గొలవానిని
వెనుకకుఁ దోసి తాను ముందఱకరిగి గోడను సమీపించి
చూచుసరి కచ్చోటి గోడ యెంతో యెత్తులేదు. అచ్చటఁ
బ్రతీహారులే లేకపోయినచో మొగలసైనికు లందఱు నతి
సులభముగాఁ గోటలోఁ బ్రవేశించియుండెడివారు.

ఆకటి చీఁకటిలో కాశింఖా నెట్టులో ధైర్యముచిక్కఁ
బట్టుకొని గోడపైకెక్కి లోనికి దుముకుట కుద్యుక్తుఁ డగు
చుండఁగా నెక్కడనుండియో యొకకత్తివచ్చి యాతనివక్ష
మున గట్టిగా గ్రుచ్చుకొనిపోవుటచే నాతఁడు వెనుకకుఁ బడి
పోయెను. అట్టు లొకరివెనుక నొకరుగా మొగలసైనికు
లందఱును జంపఁబడుచుండునంతలో నాసందడినివిని కోటలో
నివారందఱు నచ్చటఁ జేరి గోడపైనున్న రాతిబండలను
క్రిందనున్న మొగలసైనికులపైకిఁ ద్రోయఁగా వారందఱు

జమునిఁజూడఁబోయిరి.

ఆకస్మికముగా కాశింఖాను వక్షస్థలమున గ్రుచ్చఁబడి నకత్తి హిమతుసింగుచేతిలోనిదే! రాత్రిభాగమునం దతఁడు దాను నియమించిన కావలివారలు తమతమవిధులను యథా విధిగ నిర్వర్తించుచుండిరో లేదోయని స్వయముగాఁ జూచు కొనుచుండు నలవాటుకలదు. ఆనాఁ డాతఁడు యథాప్రకా రముగాఁ దిరుగుచుండ కాశింఖాను గోడనెక్కుచుండగాఁ గ్రిందఁబడినరాతివలనఁగలిగినశబ్దమును విని యచ్చోటికి వచ్చి చేయవలసినపనినంతను జేసినైచెను. రాజపుత్రులు విజ యోత్సాహముతో నుండిరి. క్రమక్రమముగాఁ గోటలోని యాహారపదార్థములు తఱుగఁజొచ్చెను. పైనుండి లోని కాహా రపదార్థములు వచ్చుమార్గ మేదియును లేదు. కొలఁదిరోజు లలో మిగిలినయాహారపదార్థము లైపోవుటతోడనే కోటలో నివారందఱు తిండిలేక మాడవలసివచ్చునని హిమతుసింగు యోచించుచుండునంతలో నొకనమ్మకమైన సేవకుఁ డాతని భార్యయొద్దనుంచి కమ్మయొకదానిం దీసికొనివచ్చి యేలిక కిచ్చెను. అజాబునందు తనతండ్రిప్రాణములను గాపాడుకొను టకై తక్షణము రాజ్యమునకు హిమతుసింగు రావలయునని యుండెను. కోటలోని యాహారపదార్థము లైపోవుటయుఁ, దనతండ్రి యపాయస్థితిలో నున్నాఁడని వార్తవచ్చుటయు యోచించి హిమతుసింగానాఁడే కోటనువిడిచి తన రాజ్యము

నకుఁ బోవనిశ్చయించుకొ నెను. ఆనాఁటిరాత్రియే మహామ్మదీయులున్న నైపునుండిగాక వేఱొకప్రక్కనుండి రసపుత్రులు నిశ్శబ్దముగాఁ గోటనువీడి యచ్చోటఁ గావలిగాయుచున్న కొలఁదిమంది సైనికులను బరిమార్చి స్వేచ్ఛగాఁ దమజన్మభూమికిఁ బయనమైపోయిరి. మఱునాఁడరుణోదయమున నిర్మానుష్యమైయున్న తమదుర్గమున మొగలాయీలుప్రవేశించి తిను బండారములేవియు లేక పోవుటఁగాంచి చుట్టుప్రక్కలనున్న గ్రామాదులపైఁబడి దోచుకొనమొదలిడిరి.

అతిత్వరితగతిని బ్రయాణముచేసి ప్రియతమమగు జన్మభూమిని తమజీవితములో మరలఁ గాంచ నేరమని నిశ్చయించుకొని పోయిన యారసపుత్రప్రవాసకులు తమజన్మభూమిం బ్రమ్మఱఁ బ్రవేశించి యమందానందభరితులైరి. వారు తమ పట్టణమువైపునకుఁ బోవుచుండఁగా నొకయాశ్వికుఁ డతిరయమున వారికెదురుగావచ్చి హిమతుసింగున కొకజాబునందిచ్చెను. ఆజాబు హిమతుసింగుభార్యచే వ్రాయఁబడినది. అందువృద్ధరాజు అనఁగా హిమతుసింగుతండ్రి తనరెండవభార్యయగు సూజాబాయితోను నామెపుత్రుఁడగు బప్పాలాలుతోను శీతలసౌధమున కేఁగియున్నాఁడనియు, నాతనిప్రాణములపాయకరమగు స్థితిలోనున్నవనియు, ఎట్టిస్థితిలోనున్నను హిమతుసింగును తత్క్షణమే బయలుదేఱి రావలయుననియును వ్రాసియుండెను. హిమతుసింగు భయంకరములగు నాయుత్త

రేమునందలి విషయములను గ్రహించి తమయొద్ద నశ్వములు లేకపోవుటచే, నుత్తరములు తీసికొనివచ్చిన యాతనియశ్వమును దీసికొని దాని నెక్కి తన సైనికుల నతిత్వరితగతిని వెనుకరమ్మని యాజ్ఞాపించి శీతల సౌధమువైపునకుఁ బోయెను.

అది ఫాల్గునమాసము. వృద్ధరాజు యథాప్రకారము శీతలసౌధమునకు వచ్చియుండెను. హిమతుసింగతిరయమున నాలైదుగంటలు ప్రయాణము చేసి శీతలసౌధమును సమీపించి తాను ప్రవాసితుఁడగుటచేఁ దన్నెవ్వరైనఁ గాంచినచో ప్రమాదము సంభవించునని తలంచి యశ్వము నొకచెట్టునకు గట్టి పాదచారుఁడై రహస్యమార్గమున శీతలసౌధము దగ్గఱకుఁబోయి యొకకిటికీయొద్దఁ దన్నెవ్వరును గుర్తింపకుండునట్లుగఁ బొంచియుండెను. దేదీప్యమానములగు పెక్కుదీపములతో విరాజిల్లుచున్న యాసౌధములో జరుగుచున్న సందర్భముల నన్నిటి నాతఁడు బాగుగాఁ జూడఁగల్గుచుండెను. కిటికీలోనుండి చూచుసరికిఁ దనతండ్రియు బప్పాలాలును భోజనము చేయుటకై బల్లలయొద్దఁ గూర్చుండియుండిరి. నాఁడు వండిన మంచియాహారపదార్థముల నారగించుచుఁ బ్రక్కనే యున్న సూజాబాయిని ముసలిరాజు కొనియాడుచుండెను. ఆనాఁడుమాత్ర మేకారణముననోగాని యామాతాపుత్రుల మోములు ఘోరాపరాధముఁజేసిన వారిమోములవలెఁ గళారహితములై యుండెను. ఇంకొకక్షణమునకు సూజాబాయి

ప్రక్కగదిలోనికివచ్చి రాజుకొఱకై స్వయముగా నొకగ్లాసులో షర్బత్తును తయారుచేయుచుఁ దనమొలలో దాఁచియుంచిన చిన్నకాగితపుఁ బొట్లమునువిప్పి దానిలోని తెల్లనిపదార్థము నాషర్బత్తుగ్లాసులోఁ బోసి కలిపి రాజునొద్దకుఁ దీసికొనిపోయెను. హిమతు జరిగినఘోరమును గ్రహించి క్షణమైనను నాలసింపక గవాక్షద్వారమునఁ దనతండ్రియున్నగదిలోఁ బ్రవేశించి తండ్రికెదురుగా నిలుచుండెను. అతనిఁగాంచి ముసలిరా జదరిపడి యంగరక్షకులకై కేకలిడఁగా వారువచ్చి రాజాజ్ఞచొప్పున హిమతుసింగును పట్టుకొనిరి. ముసలిరాజు హిమతుసింగును దుర్మార్గుఁడాయని సంబోధింపఁగా హిమతుసిం గతివినయముతోఁ దానెంతమాత్రమును దుర్మార్గుఁడుగాని, ద్రోహిగాని కానని యు, సూజాబాయి మీకొఱకుఁ దయారుచేసితెచ్చిన షర్బత్తును బప్పాలాలుచేఁ ద్రాగించినచో దుర్మార్గులును, ద్రోహులు నెవ్వరో తమకే బోధపడుననియునుఁ బ్రత్యుత్తర మిచ్చెను. ఆపల్కులను సూజాబాయి విని నిర్విణ్ణయై నేలపైఁ బడిపోయెను. అంగరక్షకులలో నొకఁడా గ్లాసులోని షర్బత్తునంతను దేర్చి పాఱబోసి చూడఁగా నడుగుభాగము తళతళ మెఱయుచున్నవజ్రములపొడి నాతఁడు గాంచి రాజునకుఁ జూపించెను. హిమతుసిం గాసమయమున వచ్చోటికివచ్చి యాఘోరప్రయత్నమునుగాంచియే యుండ

కపోయినచో ముసలిరా జీపాటికి దివి నలంకరించియే యుం డెడివాఁడు.

ముసలిరాజు తన భార్యచేసినపని గ్రహించి యామెపై నుగ్రుఁడై యన్యాయముగా నామెమాటలువిని రాజ్యార్హుఁడును, పెద్దకొడుకును, మాతృహీనుఁడును, వినయధురీణసంపన్నుఁడునగు హిమతుసింగును శిక్షించిన తనబుద్ధిమాంద్యమునకై తన్ను మన్నింపుమని హిమతుసింగుపాదములపైఁ బడి వేడుకొనెను. మఱునాఁడు రాజు హిమతుసింగుతోను కతనియనుచరులతోను రాజధానికిఁబోయి మహావైభవముతో హిమతుసింగుని రాజ్యాభిషిక్తునిఁగాఁ జేసెను.

రాజ్యమునందలిప్రజలసంతోషమటుండ హిమతుసింగుతోఁ బ్రవాసమునకుఁ బోయినయాతనియనుచరులయానంద మటుండ, తనజీవితమున మరలఁగాంతుననునాశ లేక, సుక్కి, కృశించియున్నహిమతుసింగుని ప్రియభార్య యానమా వేశవైభవసంతోషమును వర్ణించుట కెవ్వరితరము ?—



# అయేషా.



బొంబాయిరాజధానికిని మదరాసురాజధానికిని సరిహద్దుప్రాంతములోనుండి చారిత్రాత్మకములై యిప్పుడు నామమాత్రావశేషములై యున్న బీజపూరు, విజయనగరము ననునవి పూర్వమొకప్పు డనఁగా మనకథాకాలమునాఁటికి మిక్కిలి యౌన్నత్యదశలోనుండి విఖ్యాతివహించినపట్టణములై యుండకపోలేదు. బీజపూరునందలి మసీదులును విజయనగరమునందుగల దేవాలయములును శిథిలావస్థలో నుండి నప్పటికిని వానినినిర్మించినవారిశిల్పకళానైపుణ్యము నిప్పటికిని జాటుచునే యుండెను. ఈదేశమునాఁటివారే కాక పరదేశవాసులుకూడఁ బెక్కుఱు ప్రత్యేకముగా, సుప్రసిద్ధములును, చారిత్రాత్మకములునగు నాపట్టణములందలిగోపురములను దేవాలయములను, మసీదులను, పెద్దపెద్దకట్టడములను జూచుటకు వెళ్ళుచుందురు. ఆనగరములు శిథిలావస్థలో నున్ననైనను వానినిఁజూచుటకుఁ బోవువారికొఱకు "మద్రాస్ అండు సదరన్ మహారాష్ట్రారైల్వేకంపెనీవారు" ప్రత్యేకపురైలుమార్గమును నిర్మించి చాల నుపకారమొనర్చియుండిరి. మనకథాకాలమునాఁటికి బీజపూరు మహమ్మదీయరాజులకును, విజయనగరము హిందూరాజులకును ముఖ్యపట్టణములుగా నుండెడివి.

పదునేనువందలయిరువదినాల్గవసంవత్సరము డిశంబ
రుమాసములో నొకనాఁ డొకగుఱ్ఱపురౌతు బీజపూరును
సమీపించుచుండెను. తానదివఱకు నైరోపాఖండమందలి
యనేకస్థలములఁ దిరిగి యనేకవిచిత్రములును, వింతలును
చూచినవాఁడై యుండెను, బీజపూరులోని సౌధములు,
మసీదులు మొదలగువానినిర్మాణకౌశల్యమున కబ్బురపడుచుండక
పోలేదు. అతఁడప్పుడు పట్టణపుసుందరత కాశ్చర్యపడుచుఁ బట్ట
ణములోఁ బ్రవేశించుసరి కాయూరిలోని యశేషజనము సం
తోషసాగరమున నోలలాడుచు ననేకవేడుకలఁ గావించుచుం
డిరి. అదిగాంచి యాతఁడు దారిం బోవుచుండినయొకనిఁ జే
బిలిచి నాఁటిసంతోషమునకుఁగలకారణ మేమని విచారింప
గా నాయాగంతుకుఁ డాగుఱ్ఱపురౌతు పరదేశస్థుఁడై యుండు
నని భావించి, బీజపూరుసుల్తానగు అలీఅదిల్‌షా, అహమ్మదు
నగరపుసుల్తానుకొమరితయు, సౌందర్యవిలాసినియునగు ఛాం
ద్‌బీబీని పరిణయమాడుచున్నాఁడనియు, నందువలన నావేడు
కలన్నియు జరుపఁబడుచున్నవనియును, ఆనాఁడే యోధా
గ్రేసరులగుగుఱ్ఱపురౌతులకుఁ బ్రత్యేకముగాఁ బోటీలు
జరుగుననియు, పోటీలో విజయుఁడగువానిని సుల్తాను తన
యంగరక్షకులకు నాయకునిఁగానియమించి గౌరవించుననియు
ఆగుఱ్ఱపురౌతు క్రీడారంగస్థలమునకు వచ్చినచో పోటీలోఁ
బాల్గొనవచ్చుననియుఁ జెప్పి వెడలిపోయెను.

మనకథానాయకుఁడగు యూసఫ్ ఖాను తనకట్టిమంచి సమాచారముఁ జెప్పినయాయాగంతుకునకుఁ గృతజ్ఞతను వెల్లడించియుండకపోలేదు. యూసఫ్ ఖాను బీజపూరుసుల్తానుతోఁ బరిచయముకలుగఁ జేసికొనుట కింతకంటె మంచియదను కలుగదని యెంచి నాఁడుజరుగనున్నపోటీలోఁ బాల్గొనుటకు నిశ్చయించుకొనియెను. పోటీలో జయమందినచో సుల్తానుని యంగరక్షకులకు నాయకుఁడగుటయేగాక మున్ముందింకను వృద్ధిలోనికి రావచ్చునని కూడ నాతఁడూహించెను. "అతఁడు టర్కీజాతివాఁడు. ఆతనిజన్మస్థానము కాన్స్టాంటినోపిలు" అతఁడు పెక్కుదేశములు తిరిగి తిరిగి చివరకు హిందూదేశమునకు వచ్చి యప్పటిదినములలోఁ దఱచు యుద్ధములలో మునిఁగియుండెడి బీజపూరుసంస్థానము తనవంటియోధున కేదైన స్థాన మియ్యకపోదని తలంచి యచ్చోటికివచ్చెను. ఆతఁడు నడిమివయస్సులోనుండి టర్కీదేశపు యోధాగ్రేసరులలో నొకఁడుగాఁ బరిగణింపఁ బడుచుండెడివాఁడు. కాలకర్మవశమున నాతఁడొకసారి యుద్ధభూమియం దాపత్తుపాలై బందీకృతుఁడగుటచే నాతనిని బంధించినవారు వానిని సమీపముననే పోవుచున్న యొకపోర్చుగేసు ఓడవర్తకునకు బానిసగా నమ్మివేసిరి. ఆవర్తకునియొద్ద విలువయగు సామగ్రితో నిండియుండుటఁగాంచి యూసఫ్ ఖానుఁడు యజమానుఁడాతని నాయొద్దను రక్షించువారలలో నొకనిగా నియ

ఘించెను. ఆయోడ సముద్రమునఁ బ్రయాణము చేసి చేసి కొంత కాలమునకు హిందూదేశపు దీరముఁ జేరినపిదప లంగరు వేయఁబడియుండగా నొకనాఁటిరాత్రిసమయమున నాకస్మికముగా దోపిడిచేయుటకై యాయోడపైఁబడిరి. దొంగలసంఖ్య మెక్కుడుగా నుండుటచే నోడ తప్పక దొంగలకు వశమగుస్థితిలో నుండెను. అట్టిసమయమున యూసఫ్‌ఖాను తనధైర్యసాహసములఁ జూపి, యాదొంగలనందఱఁ బరిమార్చి వారి కళేబరముల సముద్రములోఁ బాఱవైచి తనయజమానుని యోడను రక్షించియుండెను. వర్తకుఁడు మాత్రము కృతఘ్నుఁడై యుండలేదు. ఓడ గోవాపట్టణముఁ జేరుటతోడనే యూసఫ్‌ఖాను నాతఁడు స్వేచ్ఛగ విడిచిపెట్టుటయే కాక, చాలధనమును బహుమానముగా నిచ్చి, క్రైస్తవమతమును స్వీకరించినచో మంచియుద్యోగ మిచ్చునట్లుగా రాజప్రతినిధికి "సిఫారసు" చేయుదుననికూడ చెప్పెను. స్వచ్ఛమగు మతాభిమానముగలయోధుఁడు యూసఫ్‌ఖాను, అస్థిరమగు నుద్యోగవాంఛచేఁ దాను మతభ్రష్టుఁడఁగాననియుఁ దన భవిష్యజ్జీవితమును దక్కనులోని యేమహమ్మదీయప్రభుస్థానములోనైన సాగించుకొందుననియుఁ జెప్పి యాతనియొద్ద సెలవుఁదీసికొని వర్తకుఁడిచ్చినబహుమానధనముతో గోవాలో నొకమంచిగుఱ్ఱమును, యోధాగ్రేసరునకుండవలసిన కవచాంగదాములను కొని, హిందువులకును మహమ్మదీయుల

కును కొలఁదికాలములోనే యుద్ధమురానున్నదని తెలిసికొని బీజపూరునకుఁ బయనమై పోయెను.

ఆసమయముననే సుల్తాను అలీఅడిల్ షాకును ఛాందిబీబీకిని వివాహ మతివైభవముగా జరుగుచుండెను. యూసఫ్ ఖాను బీజపూరును జేరి యాగంతుకునిచే నెల్లసంగతులవిని పోటీలుజరుగుచున్న తాలింఖానా చేరునప్పటి కచ్చటివా రాతనిని సగౌరవముగా నాహ్వానించి యాతఁడు పాల్గొనదలఁచిన పోటీలు మధ్యాహ్నకాలమున జరుగునని చెప్పి విడిసియుండుట కాతని కుచితమగు ప్రదేశముంజూపిరి. ఆతఁ డెక్కి వచ్చిన యశ్వమును రాజాశ్వములుండు శాలలోఁ గట్టించి, రాజాశ్వములతోపాటు దానికి ఆహారపానీయము లొసంగునట్లుగ నేర్పాటుచేయఁబడెను. అతఁడు తనకొఱకు నియమింపఁబడినబసఁ బ్రవేశించి యోధవేషమునుదీసివేసి సామాన్యదుస్తులనుధరించి, సకలోపచారములఁ బొందినవాఁడై తాలింఖానాలో జరుగుచున్న యితరపోటీలను గాంచుటకై వెళ్ళి, యాతనికొఱకు సుల్తానుప్రక్కనే యమర్పఁబడిన యుచితాసనము నలంకరించి యచ్చోట జరుగుచున్న నానావిధములగు పోటీలనుగాంచి సంతసించెను.

ఆనాఁటియుదయమున నచ్చోటఁ జేరిన రెండుమూఁడు లక్షలజనము నచ్చటజరిగినవినోదములంగాంచి యమందానందభరితులైరి. పోటీలలో గొఱ్ఱెలు, గుఱ్ఱములు, ఏనుఁగులు

మొదలగు ననేకవిధము లగు జంతువులు పాల్గొనుటయేకాక, మనుష్యులుకూడ ననేకవిధము లగుపోటీలందు పాల్గొనిరి. ఆయాపోటీలలో జయమందినవారికి సుల్తాను ఉచితరీతిని సన్మానించి బహుమానకరించెను. మధ్యాహ్నసమయమగుటచే నాపూటకు వినోదములు పోటీలు విరమింపఁబడెను. కొందఱుతినుటకుబహల కేగ మఱికొందఱు ఇండ్లకుపోయినచో మాధ్యాహ్నకాలమున మరలఁ దగినసమయము దొరకదేమో యని యచ్చటనే యుండిరి. యూసఫ్ ఖాను నాఁటిమధ్యాహ్నమే పోటీలోఁ బాల్గొనవలసియుండుటచేఁ దనబసకుఁబోయి పోటీలోఁ బాల్గొనుటకుఁ గావలసినసర్వమును సిద్ధముచేసికొని ఖడ్గకవచాంగదాదుల ధరించి తనయుత్తమాశ్వము నధిరోహించి ధైర్యోత్సాహులై తాలింఖానుకుఁ బోయెను.

నాఁటిమధ్యాహ్నము పోటీలోఁ బాల్గొనవచ్చినవారి సంఖ్య యేఁబదినలుగురగుటచే వారందఱు పోటీలోఁ బాల్గొనుటకు ముందొకపరీక్షను లోను గావలసివచ్చెను. వారందఱశ్వారూఢులై నల్గురేసి యొకజట్టుగా తాలింఖానాను నాలుగుపర్యాయములు చుట్టిరావలయుననియు, నందులో జయముగాంచినమొదటినల్గురే పోటీయందు పాల్గొనుట కర్హులుగా నేర్పాటుజరిగెను. ఆటు లాపరీక్షలో నుత్తీర్ణులైన నల్గురిలో యూసఫ్ ఖాను మొదటివాఁడు. రెండవయాతఁడు మంచియంగసౌష్ఠవముకలిగి మిక్కిలిపొడవరియై బీజపూరు

పోలీసుశాఖలో నున్నతోద్యోగముం దుండిన అబిసీనియాదేశ స్థుడగు సిద్దిహస్సన్ అనునాతఁడు. మూఁడవయాతఁడు మంచియాశ్వికుఁడగు నొకయోధుఁడును, నాల్గవయాతఁడు అక్బరునాస్థానమునుండివచ్చిన మొగలయోధుఁడునై యుండిరి. పోటీలో వారశ్వారూఢులై చేత బల్లెములధరించి యొకరి నొకరు డీకొనవలసియుండెను. మొదట మూఁడవయాతఁడగు నాయోధుఁడును, సిద్దిహస్సనును పోటీసల్పిరి. ఇర్వురు తమతమబలాబలములఁ జూపించిరి. కాని, తుదకు అబిసీనియాయోధుఁడే జయముగాంచెను.

తరువాతఁ గొంతసేపటికి యూసఫ్ఖానుఁడును, అక్బరుచక్రవర్తి యాస్థానమునుండివచ్చిన యామొగలయోధుఁడును తమయశ్వముల నధిరోహించి తాలింఖానా మధ్యభాగమునకు వచ్చి తాలింఖానాయజమాని యాజ్ఞచొప్పున నొకరినొకరు డీకొనిరి. ఇర్వురు నొకరికొకరు తీసిపోవనివారగుటంజేసి జయ మేరికిఁ జేకూరునది చెప్ప వీలులేకుండెను. మొదట మొగలయోధుఁడు వక్షస్థలముగురిచూచి యూసఫ్ఖాను నొకదెబ్బ కొట్టెను. దానికి బదులుగా యూసఫ్ఖాను మొగలయోధునిశిరమునకు గురిచూచి కొట్టగా నాతఁడు శిరోరక్షణార్థమై ధరించినకవచము తునియలై నేలఁబడుటయేగాక తానుకూడ నేలపైఁ బడిపోయెను. యూసఫ్ఖానుఁడపుడు పడిపోయినతనప్రత్యర్థిని సమీపించి గుఱ్ఱము

పైనుండి యాతనిప్రక్క కొరఁగి యా మొగల్ యోధునకుఁ జేయూఁతనొసఁగి మరల నాతఁడు తనయశ్వము నధిరోహించునట్లుగాఁ జేసెను. ఇదిగాంచి చూచుటకు వచ్చినవారు యూసఫ్‌ఖానుని సాహసౌదార్యముల నెంతయుఁ గొనియాడిరి. తుద కాపోటీయందు యూసఫ్‌ఖానుఁడే విజయమును గాంచెను.

తుదిపరీక్షలో యూసఫ్‌ఖానుఁడును సింహాస్సన్ యును పాల్గొనవలసియుండెను. కొంతవడి సేదదేర్చుకొని వారిర్వురును తాలింఖానామధ్యభాగముం జేరుకొనిరి. ఒకరినొకరు డీకొనఁబోవుటకుముందు యూసఫ్‌ఖానునికవచము కొంచెముపాడువడియుండుటఁ గాంచి మొదట నాతనితో యోడిననా మొగల్ యోధుఁడు తాలింఖానామధ్యభాగమునకువచ్చి తనకవచముందీసి యూసఫ్‌ఖానునకిచ్చి ధరింపుమని కోరఁగా సంతోషపురస్సరముగ దానిని స్వీకరించి యూసఫ్‌ఖానుఁడు తనకవచమునుదీసివేసి యాతఁడిచ్చినకవచమునుధరించెను. ఆయౌదార్యచర్యయే యాయిర్వురగాఢానురాగమునకును బీజమయ్యెను. తాలింఖానానాయకునియాజ్ఞ మేరకు యూసఫ్‌ఖానుఁడునుసింహాస్సన్ యును ఒకరినొకరుడీకొనిరి. ఇర్వురునతిఘోరముగఁ బోరాడిరి. కాని, చివరకుయూసఫ్‌ఖాను బలముగుదెబ్బకొట్టుటచేసింహాస్సన్ గుఱ్ఱముపైనుండిదొరలినేలపైఁ బడిపోయెను. ముందువలెనే యూసఫ్‌ఖాను పడిపోయినతన

ప్రత్యర్థికి సాహాయ్యముచేయు మంచియుద్దేశ్యముతో గుఱ్ఱము పైనుండిదిగి యాతఁడు పడిపోయినస్థలమునకు వచ్చుచుగాని యది విషమించెను. దుర్మార్గుఁడును కుత్సితుఁడునగు నాసిర్ హాస్సన్ యూసఫ్ఖానును తనకు దగ్గరగా రానిచ్చి యొక్క యుదుటున లేచి తనఖడ్గముతో నాతనిపైఁ బడెను. అదిగాంచి సాహసవంతుఁడగు యూసఫ్ఖాను వేగున వెనుకకుఁ బోయి తనపై ననంఖ్యాకములుగ విసరఁబడుచున్న కత్తివేటుల నన్నింటిని గాచుకొనుచుండెను. జయాపజయములు సూచించుటకు నియమింపఁబడిననాయకు లచ్చోటజరిగిన యన్యాయచర్యకుఁ గుపితులైరిగాని యూరకుండిరి. చివరవఱకుఁ జూచిచూచి యూసఫ్ఖా నొకబలమగుదెబ్బను సిర్ హాస్సన్తలపైని గట్టిగాఁ గొట్టగా నాతనితలపైనున్నకవచము ముక్కముక్కలగుటయే కాక తలపైఁ బెద్దగాయ మేర్పడెను. యూసఫ్ఖానుఁ డట్టిజయమునుగాంచుట జూచి చూపరు లాహ్లాదముతోఁ బెద్దసందడి జేసిరి. యూసఫ్ఖాను సుల్తానునొద్దకుఁ గొనిపోఁబడి సగౌరవముగ నాహ్వానింపఁబడి మంచివిలువగలవస్తువులును బంగారుపూఁతపూయఁబడిన కత్తియును బహుమతులఁ బొందెను.

మఱునాఁడు జరిగినదర్బారులో సుల్తాను యూసఫ్ఖానును తనయంగరక్షకులకు నాయకునిఁగా నొనర్చి గౌరవించెను. నాఁటిదర్బారులో హిందువులతో రానున్నయుద్ధము

నుగుఱించిన యేర్పాట్లవిషయమై యాలోచించిరి. ఒక్కొక్కటిగా నేమహమ్మదీయరాజ్యమైనను యుద్ధమునందు విజయనగరరాజ్యము నోడింపలేరనుసంగతి బీజపూరుసుల్తానునకేగాక మహమ్మదీయరాజులందఱికిని తెలియును. ఇపుడు బీజపూరుసుల్తానగు అలీఅడిల్ షా అహమ్మదునగరుఫాదుషా పుత్రికయగు ఛాంద్ బీబీ నుద్వాహమాడుటచే నారెండురాజ్యము లేకములైనవి. ఆరెండురాజ్యము లొకటై హిందువులతో యుద్ధముసల్పునని యెఱింగించినతోడనే మఱిపెక్కురు మహమ్మదీయరాజులు వారితోఁ గలిసి పోరాడుటకై శపథము చేసిరి. ఇఁక విజయనగరము నెట్లు ముట్టడింపవలయునా యనువిషయమును యుద్ధాలోచనాసంఘము వారాలోచింప మొదలిడిరి.

ప్రపంచమందలి గొప్పపట్టణములలో నొక్కటని ప్రసిద్ధికెక్కి, హిందూరాజ్యమునకు ముఖ్యపట్టణమై శత్రుదుర్భేద్యమై, అసంఖ్యాకములగు రథ, గజ, తురగ, పదాతిసైన్యములుకలిగి, యవక్రపరాక్రమశాలియు, సాహసికవీరుఁడు నగురామరాజుచేఁ బరిపాలింపఁబడుచున్న విజయనగరసామ్రాజ్యమును జయించు టంతసులభమైనకార్యము గాదు. కొలఁదికాలములో మహమ్మదీయులు దండెత్తిరానున్నారని యెఱింగియుండుటచే రామరాజు కడుజాగరూకుఁడై యుద్ధసన్నాహముల సదినఱకుఁ జాలకాలమునుండియే చేయించు

చుండెను. బీజపూరునం దగూడిన మహమ్మదీయయుద్ధాలో చనాసంఘమువారు చివర కొకతీర్మానమును గావించిరి. తమయాస్థానమునంగల యొకయోధుని మాఱువేషమున విజయనగరమున కంపించి రహస్యముగ నక్కడ జరుగుచున్న యుద్ధప్రయత్నము లన్నియుం జూచివచ్చుట కేర్పాటుచేయంబడెను. అందులకుంగాను మొదట సిద్ధిహుస్సేన్ పేరు సూచింపంబడెనుగాని యాతండందుకు నెఱింగినవాండగుటచే యూసఫ్ఖానుండందులకు నియోగింపంబడెను. యూసఫ్ఖా నొకటర్కీవర్తకుని వేషమువేసికొని ఖజానాలోనున్న విలువగల రత్నమాణిక్యాదులం గొన్నింటినిదీసికొని యుత్తమాశ్వముపై నొకశుభముహూర్తమున విజయనగరమునకుం బ్రయాణమై పోయెను.

అతిత్వరితముగాం బ్రయాణముసాగించి దారిలో నెట్టి యడ్డంకులు లేకపోవుటచేం గొలందిదినములకే యూసఫ్ఖాను విజయనగరమును సమీపించెను. చూపఱ కాహ్లాదమునుగలిగించు నాపట్టణపుఘనత కెంతయు నచ్చెఱువందుచు నాయోధుండు పురద్వారమును సమీపించి తానొకటర్కీదేశపువర్తకుండననియు లోనికిం బ్రవేశముకోఱకై యాజ్ఞకావలయుననియుం బ్రతీహారుల కెఱింగించెను. వర్తకుండనుప్రతివానికిని పురప్రవేశమిచ్చునట్టి రాజాజ్ఞ యిదివఱకే యుండుటంజేసి రక్షకశాఖాధికారి యాతని రాజప్రాసాదముకడకు సగౌరవ

ముగఁ గొంపొమ్మని యొకసేనకున కాజ్ఞాపించెను. యూసఫ్ ఖాను తనకుఁ బ్రవేశమంతసునాయాసముగా లభించినందు లకు సంతసించుచు భటానియనుసరించి పోవుచు మార్గమున కిరుప్రక్కలను నిర్మింపఁబడియున్న ప్రాసాదములకట్టడముల నిర్మాణతకును సరోవరములసొంపునకు నచ్చెఱువందుచు విజ యనగరసామ్రాజ్యపాశ్చాత్యము నెంతయుఁ గొనియాడుచుఁ బోవుచుండెను. అట్లు మూఁడునాళ్లుమైళ్లుప్రయాణముచేసిన పిదప రాజప్రాసాదముసమీపముననే వర్తకులు మొదలగు యతిథులకొఱకు నిర్మింపఁబడినసౌధమున కాతఁడు గొంపోఁ బడి యందు విడిసియుండెను. రాజప్రాసాదనిర్మాణకౌశలము నకు నచ్చోటఁ గావలికాయుచున్న యసంఖ్యాకులగు రక్షక భటులను గాంచి యూసఫ్ఖా నాశ్చర్యపులకాంకితుఁ డయ్యెను.

టర్కీదేశపువర్తకుఁడు వచ్చినాఁడని వినుటతోడనే రాజతఁడు తెచ్చినవస్తువులతో జనానాయుండు ప్రదేశము నకుఁ బ్రక్క నేయున్నగదిలోనికి వచ్చునట్లుగా నాజ్ఞాపించుట చే నచ్చటికావలివా రాతని నచ్చోటికిఁ దీసికొనిపోయిరి. నల్గు రుపరిచారికలు వెంటరా రాజ్ఞియగుసరస్వతీదేవి తనప్రియ భర్తయగు రామరాజుతో వర్తకుఁడున్నగదిప్రక్కగదిలోనికి వచ్చెను. రాజాజ్ఞచొప్పున నాటర్కీవర్తకుఁడు తాను తెచ్చిన వస్తువుల నొక్కొక్కటిగా నాదాసీజనముచే లోనికిఁ బంపు

చుండఁగా నారాజదంపతులు తమకు వచ్చినవానిం దీసికొను చుండిరి. ఆవర్తకుఁడు చివర నొకగొప్పవిలువైనరత్నమును దాసిచే లోనికిఁబంపఁగా సరస్వతీదేవి దానింగాంచి మిక్కిలి సంతోషించి దాసీజనములో నొకదానిఁబిలిచి నీవు టర్కీ భాష నెఱుంగుదువుకదా! ఈరత్నమాతని కెక్కడనుండి వచ్చెనో! దీనికనీసపువెల యెంతయో కనుఁగొని రమ్మని యాజ్ఞాపించెను. ఆదాసి యోఘుఁడను నొకటర్కీదేశస్థుని కొమరిత. కాలవశమున నాయోఘుఁడు తనకుటుంబముతో హిందూదేశమునకు వచ్చి మహమ్మదీయులకొలువులో నుండెడివాఁడు. హిందువులకును మహమ్మదీయులకును జరిగిన యొకయుద్ధములో నాటర్కీదేశస్థుఁడు రామరాజుచే హతుఁడుకాఁగా నాతనిభార్య భర్తృవియోగమును సహింపలేక సహగమనమొనర్చెను. అపుడు వారిముద్దుబిడ్డయగు 'అయేషా' యనాథబాలికయై యేడ్చుచుండఁగా రామరాజామెం జేరఁదీసి తనభార్యయగుసరస్వతీదేవియొద్ద దాసిగా నుంచెను. ఆటర్కీయోఘునికూఁతురగు ననాథబాలికయే నేఁడు రాణిచే టర్కీవర్తకునితో సంభాషించుటకు నియమింపఁబడినదాసి యగు అయేషా:—

రాణియాజ్ఞచొప్పున, అయేషా వర్తకునియొద్దకుఁబోయి టర్కీభాషలో రాణియడిగినవిషయముల నడుగఁగా నావర్తకుఁడు తానారత్నము నైరోపాదేశమునుండి తెచ్చితి

ననియు, దానికనీసపువెల లక్షరూప్యములగుననియు, రాణి గారి కది కావలసియున్నచోఁ దాను కాన్కగా సమర్పింతు ననియుఁ జెప్ప రాణి దానిని సంతోషపూర్వకముగ స్వీకరించెను. వర్తకునితోఁ బేరఫుమాటలు మాటలాడుచు అయేషా యావర్తకుని నాఁటియర్ధరాత్రిసమయమునవచ్చి శివాలయమునొద్దఁ దన్నుఁగలిసికొనుమని వేఁడుకొనెను. వస్తువిక్రయమైనపిదప యూసఫ్ఖాను తనబసకువచ్చి యాటక్కయువతి వేడికోలుఁగూర్చి యనేకవిధములఁ దలపోసికొనుచు నర్ధరాత్రిసమయమున నందఱును మాటుమణఁగినపిదప శివాలయమునొద్దకుఁబోయి యచ్చట నొకశిలావేదికపైఁ గూర్చుండెను. శివాలయమునకుఁబోవుచు దారిలో నాతఁడు విజయనగరమునందున్న సైనికులు నివసించుప్రదేశములదారినిపోయి యచ్చటనున్నయిరువదివేల యశ్వసైనికులను, వేయిమంది షిరంగులను, రెండువేలకుమించిన యుద్ధపుటేనుఁగులనుగాంచి యాశ్చర్యచకితుఁడయ్యెను. వారందఱు యుద్ధమునకై సర్వసిద్ధముగానుండుటఁగూడ నాతఁడు గ్రహించెను.

నిర్మానుష్యముగను నిశ్శబ్దముగ నున్నయాప్రదేశమునందుఁ గూర్చుండి శివాలయముయొక్క నిర్మాణమునకును, జుట్టునున్న పుష్పజాతులసౌరభమునకును, నచ్చటివనరామణీయకమునకును, నెంతయు సంతసించుచున్నసమయమున మేలిముసుఁగున్వైచుకొని అయేషా యాతనిసమీపమునకే

యున్న యొకపొదరింటిలోనికి వచ్చి నిల్చుండి మృదుమధురస్వర
ముతోఁ దనమాతృదేశపుసువతనుచాటుగీతికను పాడఁగా
నాతఁడు వెనుదిరిగి యామెంగాంచెను లజ్జాభయములచే
నామె కొంతతడవట్లేనిలుచుండి చివరకు సాహసించి యాతని
తో నిట్లనియెను.

"నాదేశవాసియు, స్నేహితుఁడు నైనయో యోధుఁడా!
ఇట్టివేళ నిట్టిచోట నిన్నొంటిగాఁ గలసికొని సంభాషించునా
చర్య నీకాశ్చర్యముఁ గొలుపకపోదు. అయినను నాస్థితినిబట్టి
నే నిట్టియకార్యముం జేయవలసివచ్చినదని నేను విన్నవించు
చున్నాను. టర్కీ-దేశస్థురాలనై, అల్లానుహృదయపూర్వకముఁ
గఁ బూజించునేను ఈహిందూరాజును సేవించుచు నతికష్ట
స్థితిలో నున్నాను. కావున నేనీసేవనుండి విముక్తురాలనై
మఱియేయితర మహమ్మదీయప్రభుప్పైనన నాశ్రయించుట
కిచ్ఛగించుచున్నాను. నావిముక్తికి నీ వేవిధముననైన సాహా
య్యమొనరింపఁగలవా?"

యూసఫ్:—వనితా! బుద్ధిమంతుఁడగు యోధుఁ
డెవ్వఁడు నీకోర్కుల నిరాకరింపఁజాలఁడు. నిజమగుమహమ్మ
దీయభక్తు లెవరును విగ్రహములఁబూజించువారిని సేవింపఁ
జాలరు.

అయేషా:—అట్లైన నోపుణ్యమూర్తీ! నావిముక్తికిఁ
సాయమొనర్పుము.

యూసఫ్‌ఖానుఁడు కొంతతడవాలోచించి "ఓనారీ! నీవు నాకపరిచితురాలవైనను స్వదేశస్థురాలవగుటఁ జేసి నా ప్రాణములు నీచేతిలోఁ బెట్టుచున్నాను. నేను వర్తకుఁడను గానని నీవెఱుఁగుదువు. ఇచ్చటనున్న సేనాసంఖ్యను, ఇచ్చటి వారు చేయుచున్న యుద్ధప్రయత్నములను కనుఁగొనుటకు బీజపూరుసుల్తానుచేఁ బంపఁబడినయొక ప్రచ్ఛన్న యోధుఁడను. రేపటిరాత్రితో నిచ్చటివిషయము లన్నియుఁ బూర్తిగాఁ దెలిసికొని యెల్లుండియుదయముననే నేను బీజపూరునకుఁ బోవుదును. కావున నీవెటులైనను రాజప్రాసాదమునుండి తప్పించుకొని యానాఁటియుదయమునకు నీవొక సేవకుని వేషమునుధరించి యూరివెలుపల బీజపూరునకుఁబోవుబాటలోఁ దుంగభద్రానది కావలిగట్టున నుండఁగలిగినచో నిన్ను బీజపూరునకుఁ గొంపోవుదును. నీసంరక్షణకై నాప్రాణములను సైతము సమర్పించుటకు సంసిద్ధుఁడనై యుంటిని." అనెను.

అయేషా:—అటులైన నీవు చెప్పినచొప్పుననే చేయుదును. అని కొంతదూరముపోయి అయేషా మరలవెనుకకు మఱలి "నావలన నీవు కోటలోనిరహస్యము లేమైన నెఱుంగఁదలఁచినచో నే నెఱింగినంతవఱకుఁ జెప్పుదును. ఇంతకంటె ననాథయగు యీమహమ్మదీయనారి యేమియుఁ జేయఁజాలదు." రాజును రాణియు మాటలాడుకొనుచున్నపుడు రాజు తానుచేయుచున్నయుద్ధప్రయత్నములంగూర్చి పొగ

డుచుఁ దనవిజయమున కనేకమార్గము లున్నవని చెప్పెను. మీాసంస్థానమున "సిద్ది" "సిద్ది" తరువాతిపేరు మఱచితిని అనునాతఁడు కలఁడా? యని అయేషా యడిగెను.

"హాస్సన్! అతఁడే నా? "యని యూసఫ్‌ఖానాతురతో ననెను.

అయేషా! అవును. సిద్దిహాస్సన్ అతని పేరు. ఆతడు రాజద్రోహియై రామరాజుతోఁ గూడి మహమ్మదీయసేనల నొకమాయామార్గమున నడిపించుటకును, అచ్చట హిందువులు వేయిమందిగుండ్లతో సిద్ధముగానుండి మహమ్మదీయు లచ్చోటికి రాఁగానే గుండ్లను బేల్చి మహమ్మదీయసేనల నాశనముగావించుటకును నేర్పాటుగావించియున్నాఁడు.

యూసఫ్:—నారీరత్నమా! నీవిచ్చినయీ సమాచార మొక్కటియే నాకుఁ జాల విలువయైనది. మన మొకవేళ బీజపూరు చేరఁగల్గినచో నాయాస్థానమున నీకు మంచిస్థాన మిప్పింతును.

"అట్లయిన నేను సెలవుతీసికొందును." అని చెప్పి అయేషా యావీఁకటిలో మా యమైపోయెను.

అయేషాతో మాటలాడి యూసఫ్‌ఖాను తన బసకు వచ్చి నిదురించి యుదయముననే లేచుసరికి రక్షకభటాధికారి వచ్చి యాతనిబంధించి తీసికొనిపోయి కారాగృహమం దుంచెను. వర్తకరూపమున యూసఫ్‌ఖానుఁడు రాణికి బహు

మాసముగా సమర్పించినరత్నము బీజపూరు సంస్థానమునకుఁ జెందినదని విజయనగరసంస్థానపు షరా తెలిసియుండుట చే నాతఁడు రాజుతో నాసంగతిఁ జెప్పి, వచ్చిన యాతఁడు వర్తకుఁడుగాఁడనియు, మనరహస్యములనుఁగనుఁగొనిపోవుట కు వచ్చిన మాఱువేషధారియగు మహమ్మదీయుఁడనియు నెఱింగించుటతోడనే రాజాతని బంధించి జాగ్రత్తగా నుంచు మని యాజ్ఞాపించెను.

యూసఫ్ ఖానును ఖైమనందుంచినపదియవనాఁడు హిందూసైనికు లాదటుఁగృష్ణానదిని సమీపించి సిద్దీహాస్సన్ చెప్పినచోప్పున అక్కడక్కడఁ జెదరి యొకచోట వేయిమంది గుండ్లనుజేర్చి మహమ్మదీయసేనలరాక కెదురుచూచుచుండిరి. మహమ్మదీయసేనలన్నియు సిద్దీహాస్సన్ యొక్కయు, పోటీ యందు ప్రాణొనినమొగలయోధునియొక్కయు నాయకత్వ ముక్రింద హిందువులను జీకొనుటకై హిందూసైన్యములున్న వైపునకే వచ్చుచుండెను. తాను హిందువులకిచ్చినసంజ్ఞను సిద్దీహాస్సన్ ప్రదర్శించుట కొకక్షణమునకుముందే యశ్వా రూఢుఁడైన యొకయోధుఁ డతిరయమున నచ్చోటికివచ్చి మహమ్మదీయసైనికులవెనుకకు మరలునట్లుగానాజ్ఞాపించెను. ఆతఁ డదృష్టవంతుఁడును, మహమ్మదీయయోధుఁడు నగు యూసఫ్ ఖానే! ఆతఁ డట్లాజ్ఞాపించుటఁజూచి సిద్దీహాస్సన్ కోపోద్దీపితుఁడై నీవెవ్వఁడవని యాతనిపైఁబడగా యూసఫ్

ఖానుఁ డొక్కవ్రేటున నాదుర్మార్గునితలఁ దెగనరికెను. తమ నాయకునిఁ జంపుటతోడనే యాసైనికులు యూసఫ్ ఖానుని పైఁ బడఁబోయిరి. కాని, మొగలయోధుఁడు వారినివారించి యూసఫ్ ఖానును సుల్తానుమొద్దకుఁ దీసికొనిపోఁగా యూస ఫ్ ఖాను తాను విజయనగరము ప్రవేశించినది మొదలు జరిగిన సంగతులన్నియుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పి బందీకృతుఁడగు తాను అయేషాయఖండప్రయత్నములవలన విముక్తుఁడై అతి రయమున వచ్చి మహమ్మదీయసేనలఁ గలసికొనకపోయి నచో నీపాటికి హిందువు లఖండవిజయమునుగాంచియే యుం దురనియుఁ జెప్పెను. యూసఫ్ ఖానునిసాహసమున కచ్చెఱు వంది సుల్తాను ఆతని నాయకునిఁగా నియమించి పోరుసాగిం చెను. కోటలోనిసైనికులందఱు యుద్ధభూమికిఁబోయి యుం డినయదను కనిపెట్టి అయేషా కావలివారికి మంచిలంచమిచ్చి యూసఫ్ ఖానుని విముక్తునిఁజేసి యాతని కొకయుత్తమాశ్వ మును ఖడ్గమునిచ్చి పంపివేసెను.

పదునెనిమిదివందల యఱువదిమైదవసంవత్సరము జన వరి యిరువదిమైదవతారీఖున హిందువులకును మహమ్మదీ యులకును జరిగినయుద్ధమే హిందూదేశచరిత్రమునం దగ్ర స్థానమందిన “తాళికోట” యుద్ధము. అట్టియుద్ధ మెన్నఁ డును జరిగియుండలేదు. ఇరుతెగలవారికిని ఘోరమగుపోరు జరుగుచుండఁగా యూసఫ్ ఖాను, అదనుకనిపెట్టి రామరాజు

తల తెగనరకి తనకత్తిమొనకుగుచ్చి యేనుఁగుపై నెక్కి కత్తినిపైకెత్తి రాజుశిరము నెల్లరకుఁ జూపుచుండెను. హైందవసైనికులు తమప్రభువుచంపఁబడినాఁడని యెఱుంగుటతోడనే పలాయితులైరి. ఎట్టి రక్షణయులేని విజయనగరము-ప్రపంచమునందు గొప్పపట్టణములలో నొకటిగాఁ బేర్వన్నెకెక్కిన విజయనగరము- హిందూరాజ్యమునకు ముఖ్యపట్టణమై హైందవులఘనతను వేవిధముల వెదచల్లుచుండెడివిజయనగరము—మహమ్మదీయులవశమైనాశనమైపోయెను. మహమ్మదీయులు పట్టణముంబ్రవేశించి యచ్చటిదేవాలయములను, గోపురములను, కట్టడములను నాశనమొనర్చివైచిరి.

యూసఫ్ ఖానుమాత్రము విజయనగరసామ్రాజ్యవినాశనమునకు మూలకారణమైన మహమ్మదీయయువతి 'అయేషా'ను మఱచిపోయియుండలేదు. అతఁ డామెను సగౌరవముగ బీజపూరుతీసికొనివచ్చి మహావైభవముతో నామెను బరిణయమాడి గొప్పయుద్యోగములో బీజపూరుసంస్థానమందు కొంతకాలముండి పిదప దారాపుత్రాదులతో స్వదేశమునకు మరలిపోయెను.

*Copies can be had from :—*

**S. V. M. Homeopathic Free Dispensary,**

**P. O. PITHAPURAM.**

**OR**

**From THE AUTHOR,**

P. O. PITHAPURAM,

*(East Godavari Dt.)*